# అహల్యాశాపవిమోచనము.

ఐదంకముల నాటకము.

గ్రంథకర్తలు

రామనారాయణకవులు.

భీమవోలు కాపురస్థులు బుక్కుసెల్లరు,

కురుకూరి సుబ్బారావుచే

ప్రచురింపబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:

స్కేప్ అండ్ కో వారి,

కే. సుబ్బారాయుడు బ్రదర్సు వారివలన ముద్రింపబడియె.

రిజిష్టర్డు కాపీరైటు. 1922. వెల 12 అణాలు.

# స్వరాజ్యధ్వజము.

వెల 0—12—0.

ఇందు పంజాబుహత్యలు తిలకురాయభారము భారతమాత విలాపము. అనేక స్వరాజ్యవిషయములను గురించి వ్రాయబడినది. ఇందునుగురించి విశేషము వ్రాయబనిలేదు. తప్పక కొనితీరవలసిన పుస్తకమిదియే. ప్రతిభారతీయుని హస్తమందు వుండితీరవలసిన గ్రంధరాజమిదియే. వేయేల ప్రతిపుస్తకభాండాగారమందు అలంకరించితీరవలయును. వెల స్వల్పము ఫలమధికము.

# హనుమద్రామ సంగ్రామము

వెల 0—10—0 మాత్రమే.

ఇందు యయాతిరాజును గురించి శ్రీరామునకు ఆంజనేయునకు యుద్ధము చేయుట. ఇందలికథ పుస్తకనామమే తెలియజేయుచున్నది. యీకథయంతయు గరుడోపాఖ్యానమువలెనే వుండును. కథాసందర్భము చిత్రవిచిత్రముగా వ్రాయబడినది. యీపుస్తకము అనేకచోట్ల నాటకము ప్రదర్శించియున్నారు. దీనిగురించి విశేషము వ్రాయబనిలేదు. కొలదిప్రతులుమాత్రమే ముద్రించినారము. త్వరపడినగాని దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు.

# కంఠాభరణం.

నాటకము 0—12—0 మాత్రమే.

ఇది పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే రచియింపబడి అనేకచోట్ల నాటకమాడబడుచున్నది. దీనియందు అంతయు విచిత్రమే. ఎప్పుడు చదివిచూచిన ఆనందమే. సోమనాథానులుగారి హాందస్తము రామశాస్త్రులుగారి పిచ్చి వేపారిపంతులు వేశ్యసంభాషణము సుబ్బిశెట్టి షష్ఠిపూర్తి మహోత్సవం నవాబుగారి దర్బారు మొదలైనవి విచిత్రముగా వ్రాయబడినది. యీపుస్తకము చదువునప్పుడు జన్మకాలమున యెప్పుడు నవ్వనివారైనను కడుపుబ్బ నవ్వ పుట్టించక మానదు. తప్పక కొనితీరవలెను. చదివితీరవలెను. ఆనందించితీరవలెను. వెల స్వల్పము. ఫలమధికము.

# అహల్యా శాపవిమోచనము.

(ఐదంకముల నాటకము.)

---

గ్రంథకర్తలు.

## రామనారాయణ కవులు.

భీమునిపట్నం బుక్కుసెల్లర్సు

## కురుకూరి సుబ్బారావుచే

ప్రకటింపబడెను.

మొదటి కూర్పు 1,000.

కాకినాడ.

స్కేప్ అండు కో, కె. సుబ్బారాయుడు బ్రిదర్సువారివలన

ముద్రితము.

1922

 [వెల రు 0—12—0

# అహల్యాశాపవిమోచనము

## — కథాసంగ్రహము. —

### ప్రథమాంకము.

రంగము:—(1) ఇంద్రలోకము:—నందనవనమున నింద్రుఁడు అహల్యంగూర్చి పరితాపమందుచుండుట; శచీదేవి యచ్చటకుఁ జెలికత్తెయగు వాసంతికతో నరుదెంచి పరితాపకారణమెఱుంగుట.

రంగము:—(2) గౌతముని యాశ్రమము:—గౌతముఁ డహల్యకు, పతివ్రతాలక్షణములఁ జెప్పుట. అహల్య పతికనుగుణముగా భూషణములఁ దీసివేసి నారలం దాల్చుట.

### ద్వితీయాంకము.

రంగము:—(1) ఇంద్రలోకము:—మందిరమున నింద్రుఁడహల్యాసౌందర్యమును మెచ్చుకొనుచు, నామెను గౌతముఁడు వివాహమాడఁజాలినందులకు రోషమంది యామెనెట్లయిన గవయనెంచుట. (దేవేంద్రుని యిష్టసఖుఁడగు మణికంధర సంభాషణ) శచీదేవి యచ్చటకువచ్చి య యహల్యవిషయమై యెట్టి దుష్కృత్యమును జేయవలదని భర్తతోఁ జెప్పుట.

రంగము:—(2) గౌతమాశ్రమ ప్రాంతమున వనము:—ప్రవేశము మణికంధరునితో నింద్రుఁడు. అహల్య చెలికత్తెయగు విశారదతోఁ బుష్పాపచయమునకు వచ్చుట. ఇంద్రుఁడహల్యనుజేరి ప్రార్థించుట. అహల్య తిరస్కరించుట.

### తృతీయాంకము.

రంగము: (1)—గౌతమాశ్రమము:—ఇంద్రుఁడుగౌతమాకృతినియహల్యం జేరుట. అహల్యయు నింద్రుఁడును గలసియుండఁగా, గౌతముఁడువచ్చి యింద్రుని మాయనెఱిగి శపిం

చుట. అహల్యకు భాషాణరూపము ధరించుమని శాపమిచ్చి, యాశ్రమము వేసుకొనగా, శ్రీరామపదరజము సోకినప్పుడు శాపవిముక్తియగునని చెప్పుట.

రంగము:—(2) ఇంద్రునివిషయమై మునికంధరుఁ డాలోచించుచుండ శాపతప్తుఁడయిన యింద్రుఁడు వచ్చుట.

## చతుర్థాంకము.

రంగము:—అయోధ్య:—విశ్వామిత్రుఁడు సవనరక్షణార్థము శ్రీరాముని బంపుమని దశరథుని నడుగుట. దశరథుఁడు రాముని నెడఁబాయజాలననుట. తుదకు వసిష్ఠుని వాక్యములపై నతఁడు శ్రీరాముని విశ్వామిత్రునితోఁ బంపనిశ్చయించుట. లక్ష్మణుఁడుగూడ శ్రీరామునితో నేగుటకు తండ్రిచే ననుజ్ఞాతుఁడగుట.

## పంచమాంకము.

రంగము:—(1) అరణ్యమార్గమున, విశ్వామిత్రుఁడు శ్రీరామలక్ష్మణులను వెంటబెట్టుకొని యాశ్రమమునకుఁ బోవుచుండుట. శ్రీరాముఁడు తాటకను సంహరించుట విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు బలాతిబలయనువిద్యలను, నస్త్రశస్త్రములను నొసంగుట.

రంగము:—(2) విశ్వామిత్రుని యాశ్రమము:—శ్రీరామ లక్ష్మణులు విశ్వామిత్రుఁడు యజ్ఞము సేయుచుండగా మారీచ సుబాహులువచ్చుట. శ్రీరాముఁడు సుబాహుం గూల్చుట. మారీచుఁడు పాఱిపోవుట. విశ్వామిత్రుఁడు శ్రీరామునిఁ యజ్ఞమురక్షించినందులకు గొనియాడుట.

రంగము:—(3)విశ్వామిత్రుఁడుశ్రీరామలక్ష్మణులనుమిథిలాపురమునకుఁ దోడ్కొనిపోవుచుండుట.అహల్యాశాపవిమోచనము.



# అహల్యాశాపవిమోచనము.



## ప్రథమాంకము.

—o—

### రంగము. 1.

[ఇంద్రలోకము, నందనవనమున, నింద్రుఁడు, ప్రవేశము.]

అనుబంధము. (1)

ఇంద్రు—(తనలో) ఔరా! ప్రజాపతి యెంతపనిఁ జేసెను?

మ. ననులోకత్రయనాథుఁ జేకొనక, య । న్యాయంబువాటించు, య
వ్వనజాతోద్భవుఁడా శశాంకముఖని । బద్మాయతాక్షిన్ యహ
ల్యను, నుద్వాహముఁ జేసె గౌతమునకా । హా! దీని కేమందు; న
మ్మనమందే గతిసైచువాఁడ శశిబిం । బఁగూడ కాక్రాంతయున్.

ఆయహల్యా సౌందర్యము నాహృదయము సంపూర్తిగ నాకర్షించివేసినది. హృదయము నెంతపదిలపఱచుకొనఁ దలంచినను నాగకున్నది.

ఉ. అనునుగొప్పు, నాసుమహి । తాస్యధగద్ధగ, లాశ్రుతిద్వయం
బానగుమోముతీరు; వన । జాస్త్రనితూపులఁబోలుచూపులా
పానవవిక్రమోష్ఠరుచి । యాచపలాభ శరీరసౌష్ఠవం
బానడలాపుటారములు । నార యొయారము దానికేతగున్.

ఓ! అహల్యా!

మ. నినుఁ దర్వాహమునందుఁ బొంగి; యమరుల్ | నిర్ణిద్రమోదంబునం
ద, నినుఁ గూడి సుఖాబ్ధిఁ దేలుదని చి | త్తంబందు భావింప; నీ
జనకుండైన విధాత, గౌతమునకున్ | నిన్నిచ్చె సంప్రీతి; నా
తను వేరీతిని గెల్ల వారు నిటఁ గాం | తా! పూర్ణచంద్రాననా.

అనుబంధము. (2)

సీ. అతిరూపవతి వాచు | నలరి నందుకు నీవు,
నన్నుఁ గొందువని మదిన్ | దలచినాను
యమరేంద్రుఁడితఁడంచు | ననిమైన మొక్కింత,
దలపోయుదువటంచుఁ | దలచినాను
అమరకాంతలు నీకు | నతిభక్తిఁ బరిచర్య,
సలుపుదురటంచును | దలఁచినాను
పాకశాసనుదేవి | వై బహువిధసౌఖ్య,
ములఁ గాంతువంచును | దలచినాను
తే. గీ. కాని తుదకీ విధంబున | మాసిమైన
గౌతముని కైకొ, నుదువని | చేతమందు
దలఁపనైతిని నెన్నఁడు | తలిరుఁబోడి
తలచినతలంపులెల్ల వి | ఫలములయ్యె.

ఒక సంవత్సరములో భూమిఁ జుట్టి యెవ్వరు ముందు వచ్చెదరో, వారికి నిన్ను సంగెదనని బ్రహ్మ చేసిన ప్రతిజ్ఞననుసరించి, గౌతముఁడు శపథంబును గెల్చుటచే నాతఁడు నిన్నుఁ గైకొనెను గాని, నిశ్చయముగా నాతనిఁ జేకొను నభిప్రాయము నీకు లేదని నేను తలంచెదను. కాకున్నచో,

తే. గీ. సకలజగముల సమ్మోహ | జలధిలోన
ముంచఁజాలిన సౌందర్య | మున, నలరు
తరుణి వేడ, యాజడ | దారి యేడ
నీవు వరియించుటది యేడ | నీరజాక్షి,

[మణికంధరుఁడు, ప్రవేశించును.]

మణి——(ఇంద్రునిఁజూచి తనలో) ఇదుగో! మహేంద్రుఁడు! ఈతని మొగము సంతకువెళ్ళి వచ్చినట్లేయున్నది. అహల్యావిషయమై యన్యథా జరుగుటయే యీతనిమోము వాడియుండుటకుఁ గారణమని యూహించెదను. నిక్షేపమువంటి భార్య, చక్కని చుక్క, శచీదేవి యుండఁగా నీతనికీదుర్బుద్ధి యేలపుట్టవలెను. (ఇంచుకయూరకుండి) నెమ్మదిగా నీతనినిఁ బలుకరించెదఁ గాక! సమీపించి (ప్రకాశముగా) మహేంద్రా! జయము. జయము.

ఇంద్రు——ఓహో! మణికంధరుడా! మిత్రమా! నీయాశీర్వచనములు ఫలించుటలేదోయి!

మణి——ఇట్లుచెప్పెదువని నాకిదివఱకే తెలియును. సరే, కాని, నీవు సత్యలోకమునుండి యెప్పుడువచ్చితివి?

ఇంద్రు——ఇదియే రాక!

మణి——ఇంతవఱకును బురములోనికి బోలేదా యేమి?

ఇంద్రు——లేదు.

మణి——అలిగి వెడలిన పెండ్లికొడుకువలె నిచ్చటనున్నావేమి! అహల్యావివాహార్థమై యరిగిన నీవింతవఱకును రాలేదని శచీదేవి కడు బెంగఁగొనియున్నది. నీవెప్పుడువచ్చెదవో యని ప్రతిదినము నామె సోకులడుగుటయే. అందఱిదేవుళ్ళకును మ్రొక్కుచుండుటయే. పోనిమ్ము. జరిగినదానికేమి? ఇంతశ్రమపడినందుకుఁ గార్యమనుకూలముగనే జరిగినదా?

ఇంద్రు——మిత్రమా! ఏమిచెప్పుదును. ఆవిధాత యెంతయు నవివేకియైనాఁడు. భూమిని నెవ్వరుముందుగాఁ జుట్టివచ్చెదరో వారికి నహల్యనొసంగుదునని యొకాతఁడు శపథముఁ జేసెనుగదా?

ఆపందెమునందు గౌతమమునీంద్రుఁడు విజయుఁడగుటం జేసి, యాతఁడా కన్నియఁ గైకొనెను.

మణి — పోనిలే! పీడవదలినది. ఇఁక నాసంగతి మఱచిపోయి నీవు రా లేదని పరితాపమొందుచున్న శచీదేవికి సంతసము గలిగింపుము రమ్ము.

అనుబంధము. (3)

ఇంద్రు — మణికంధరా! అహల్యాసంగతి మఱచుటయెట్లు. ఆజగన్మోహన విగ్రహము నాహృదయదర్పణమున బ్రతిబింబిత మగుచున్నది.

మ. కనులన్ మూసినమూయకున్న; మఱియే కార్యంబునైనన్ బూన న్నైన; లేకున్న; సఖాళిఁ గలిసినన్ యొక్కండనే యుంటినన్
వినునే నేని తలంచుచుండినను హృద్వీథిన్ సదా నాకు, నా
వనజాతాస్య మనోహరాకృతులె గన్పట్టున్ సఖాగ్రేసరా.

మణి — ఓహో హో! నీవు చదివినచదువు తుదకిట్లు బరిణమించినదా ఎంత వెఱ్ఱివాడవైతివి. ఒక్కసామాన్యవనితయందు పరాధీన మైనది. అట్టిదానికై యిట్లుపరితాపమందెదవా? ఎవ్వరైన విన్న నగరా?

ఇంద్రు — మణికంధరా! అది సామాన్యవనితయని తలంచితివా?

మ. అమరీసంఘములం గణింప దురగ శ్యామాతతిన్ మెచ్చ దు
త్తమవిద్యాధరకాంతలం దెగడు సిద్ధస్త్రీలహాసించు; నా
రమణీరత్నము, నిస్తులాకృతికి నే రామామణుల్ మూఁడులో
కములన్ సాటిగ నిల్వ లేరనుచు వక్కాణింతు నిక్కమ్ముగన్.

మణి — నీకంటికి నాయహల్య యట్లేతోఁచును. "తావలచినది రంభ. తామునిఁగినది గంగ" యను సామెత యెఱుగవా! ఏమో! యహల్యను బోలిన యందకత్తె లేదందువు. అలిచి

ప్పలవలె కండ్లు, కనికనిపించని నడుము, మందంగావుండే నడకలు, కాటుకరంగుతీరు శిరోజములు, దబ్బకాయవలె గుండ్రనైన మొగము, మొదలగునవి చూచితివా, యామె త్రిలోకసుందరియని పలికితివి? నిశ్చయముగా సౌందర్యవతియని చెప్పవలసివచ్చినప్పుడు మాయింటి యజమానురాలినే చెప్పవలెను. ఆడదియనిన నింట్లోవుండిన నెంతనిండుగా వుండవలెను. కవ్రీసంగతి తెలియక స్త్రీవర్ణన సేయునప్పుడు, సింహమధ్యయనియు, హంసగమనయనియు, చంద్రముఖియనియు, నీలకుంతలయనియు, వర్ణింతురు. ఇది యందముగాదు. కన్నులు దీపపుబుడ్లవలె నుండవలెను. నడుముయొక్క వైవారము పావుతక్కువ రెండుగజములుండవలెను. తలవెంట్రుకలు రాగివర్ణముకలిగి మొక్కజొన్నపీచువలె నుండవలెను. నడచునప్పుడు లేడివలెనుండి, ధ్వని వినిపించుచుండవలెను. మొగము గుండ్రనిసున్నవలెగాక, నంతపొడుగుగను నుండక మొగముచూడగనే మీదబడి కొట్టవచ్చినట్లుండవలెను. నేచెప్పిన లక్షణములన్నియు నున్నస్త్రీయే సౌందర్యవతియని చెప్పనొప్పును. ఇవియన్నియు నాభార్యకున్నవి.

ఇంద్ర:—సఖుఁడా నీవెప్పుడును నిట్టిపరిహాసపువాక్యములనే పలుకుచుందువు.

తే గీ॥ తాను సృష్టించివెలసిన తరుణులందు
నాయహల్యకునెనయైన యతివయుండ
గూడఁ దనుపంతమునధాత సుందరదనఁ
జేసిమించెను ప్రౌఢిమ వాసిగాంచ.

మంత్రి—ఇప్పుడీ వర్ణనయంతయు నేల కార్యము మించిపోయినదికదా "అత్యాశాపరమందుఃఖం నిరాశాపరమంసుఖం" అనిపెద్దలుచెప్పిరి.

ఆసౌందర్యవతియైన యహల్య నాకుదక్కును. నాకుదక్కును. అని, యువ్విళ్ళూరుచు, జంకలుగొట్టుకొనుచు వేచియున్న నీ వంటి వారందఱినోళ్ళంగాను మంటిబెట్టఁగొట్టి, యహల్యను గౌతముఁడు గుటుక్కున మ్రింగినాఁడు. నమలినవానికంటె మ్రింగినవాఁడు గట్టివాఁడుకదా.

[శచీదేవియు, చెలికత్తెయగు వాసంతికయు, ప్రవేశము]

వాస—దేవీ! వనవిహారమునందు నేఁడు నీచిత్తమావంతయుఁ బ్రవేశింపక యున్నదేమి?

అనుబంధము (4)

శచి—వాసంతికా! ఏమనిచెప్పుదును ?

తే గీ॥ అలయహల్యను నుద్వాహ మాడఁగోరి
యరిగె నాథుండుపెక్కునా ళ్ళయ్యెఁగాదె
నేటికిని రాకయుండెను బోటి! యిందు
కేమికారణంబో! మన సెఱుఁగరాదు.

వాసం—దేవీ! ఈవిషయమై నీవంతగాఁ జింతింపఁబనిలేదు. అహల్యా వివాహము సామాన్యముగా త్వరగా జరుగునది కాదు. విరించి యేర్పరచిన శపథంబు ననుసరించి, యెవ్వరు సంవత్సరములో భూమింజుట్టివత్తురో వారేకదా యహల్యం గొందురు. ఆ కారణమున నీప్రాణేశ్వరుఁడా యుద్యోగమున వర్తించుచుండును.

శచి— వాసంతికా ప్రజాపతి నియమించిన గడువుదినము దాటినది.

వాసం—అట్లయిన నేఁడో రేపో తప్పకవచ్చును.

శచి— కాంతావ్యసనంబునందుఁ జిక్కినయాతఁడెట్టి యిడుములపాలగుచుండెనో యని నా డెందమున సందియమగుచున్నది.

వాసం— అమ్మా! నేఁడనిన నీకుఁ గోపమువచ్చును. జగన్మోహినియగు

నీవుండగా, నీతనికీవ్యసనమేల? ఆతఁడికార్యమునందుఁ బ్రవే శించుటకు నీవేలయనుమతించితివి?

శచి—చెలీ! ఏమిసేయుదును? పోవలదని నేనెంతయో బ్రతిమాలిచె ప్పితిని. ఏంతచెప్పినను వినక యరిగెను.

వాసం—అవును, నీవేమిచేయుదువు? (ఇంచుకయూరకుండి) మన మా కమలాకరతీరమున నెక్కంతకాలము విశ్రమింతము. (ఇంచుకనడచి ఇంద్రునిజూచి సంతోషముతో) దేవీ! దేవీ! అడుగో నీనాథుఁడు.

శచీ—ఏమినాభాగ్యము.

మణి—(ఇంద్రునితో) మహేంద్ర! కోపమునిగినది. నీసంతాపము మాత్రము బయటబెట్టకుము. సాధారణముగా భార్యలు తమ భర్తలితరవనితలను వలచి సంతాపమందుటచూచి సహింపరు

ఇంద్రు—అహల్యవిషయమై ప్రియతమ్నించుటకు నేనరిగితినని యామె కుఁ దెలియును.

[శచీదేవి-యింద్రుని సమీపించును]

శచీ—(ఇంద్రునిఁజూచి) నాథా! ఎన్నాళ్ళకుఁ గంటఁబడితివి.

మణి—అమ్మా! ఎన్నాళ్ళయిననేమి? నీకు సవతిపోరు లేకుండఁదప్పిన ది, ఇంతకంటె నీకు గావలసినదేమున్నది. ఇన్నాళ్ళనుండియు నీ కట్టిబాధగలుగునేమో యని నేను విచారించుచు నట్టిది కలు గకుండఁ జేయుటకై భగవంతుని శతవిధములఁ బ్రార్థించినాను నాకోర్కె సఫలమయినది. నీకు చింతలేకుండబోయినది. ఇంక నాకేమి బహుమతినిచ్చెదవో నీచిత్తము, నాభాగ్యము.

శచీ—(తనలో) మణికంధరునిమాటలఁ బట్టిచూడగా యహల్యాద్రోహము మఱియొకవిధముగా జరిగి నట్లు దోచుచున్నది (మణి

కంధరునిఁజూచి) మణికంధరా! త్రిలోకాధిపతియగు నీమహేంద్రునిప్రయత్నము విఫలమయ్యెనా యేమి?

మ.కి.—మరల నానోట పలికించవలయుననియా నీవిట్లడుగుట సాక్షాదిందిరాదేవి కైన యగుదానవు. అమరలోకసామ్రాజ్యలక్ష్మివి, అట్టినీవుండఁగా నెత్తిమీఁదకుంపటి యన్నట్లు, అహల్యను గూడ తేదలఁచిన యాతనిప్రయత్నము సాగునా?

వాసం—మణికంధరా! నీతల్లి! నీకు బాల్యమున నెంతవసపోసినదో గాని, అబ్బబ్బా! ఏమి! ఈవాగుడు,

మణి—వాసంతికా! నాదివాగుడా నేనేదైననదలఁచినచో నీవలె గుడగుడాలోచన సేయువాడనుగాను. కుండబ్రద్దలుకొట్టినట్లు మటనే చెప్పుదును.

వాసం—నీవు చాలా ఘనుఁడవు.

మణి—నాఘనత నీకేమి తెలియును. తెల్లవాఱిలేచినది మొదలు రాత్రి పక్కయెక్కవఱకుచాటాచీపుఱుచేతఁబట్టుకొని తిరిగేదానవు.

వాసం—ఆడజన్మమెత్తిన ప్రతివారికిని నిదితప్పదు.

మణి—నీకర్మమట్లుగాలినదిగాని ప్రతివారిని ననకు.

వాసం—ప్రతివారిమాటయేల? నీభార్యసంగతిఁ జెప్పుము.

మణి—నాభార్యజన్మతో చీపురుచేత,బట్టియెఱుగదు. ఇంటిపనియంతయు నేనేచేసికొనిపోవుచుందును. ఒకవేళ యెప్పుడయినను నవసరమైనచో నావిషయమై యామె చీపురుపట్టుకొనును.

ఇంద్రు—మణికంధరా! నీకువీపుశుద్ధిసేయుటకేనా?

మణి—అప్పుడప్పుడామె నాకు వీపుశుద్ధియుఁజెంప శుద్ధియుఁజేయుఁచుండుటచేతనే, నేనిట్లుంటిని. లేనిచో, నేనీసరికెంతటి కాంతల స్వయంవరములకు వెళ్ళియుందునో, యెందఱివనితలను వివాహములాడియుందునో?

శచీ—మణికంధరా! నీపరిహాసవాక్యము లిఁకఁజాలింపుము. (ఇంద్రునిఁ జూచి) ప్రాణేశ్వరా! నగరములోనికి రాకుండనిటదడయుచుంటివేల?

ఇంద్రు—రమణీ! నేనువచ్చుచుండ, నీమణికంధరుఁ డక్కడఁదారసిల్లి నాఁడు. ఈతని వినోదభాషణముల వినుచుండుటచే నాలస్యమైనది.

శచి—ప్రాణేశ్వరా! అహల్యంగూర్చిన నీప్రయత్నము సఫలముకాలేదని నీముఖము దెల్పుచున్నది.

ఇంద్రు—(తనలో) నాపరితాపమీ మెకిప్పుడు బయలుపెట్టరాదు. (ప్రకాశముగా) సుందరవదనా! అహల్యంగూర్చిన విచారము నా మనమున నావంతయు లేదు; కాని,

చ. అమరవిభుండు జేసిన ప్రయత్నముసాగగ లేదటంచులో
కమునను గేలిసేయునని కాంతరో, యివ్విధిఁజిత్తమందు నే
నమిత విచారమందెదను నంతియె కాని యహల్యగూర్చి నా
కు మదిని లేదుచింత నవ కోయజపత్రవిశాలలోచనా.

మణి—నీచింతగూర్చి యిచ్చటఁ బ్రశ్నించినవారెవరు? (శచింజూచి) అమ్మా! ఈసంగతియంతయు విప్పాడెందుకు? గృహమునకేగి నపిదప సావకాశముగ, మాట్లాడుకొనవచ్చును. (ఇంద్రునిఁ జూచి) మహేంద్రా! అట్లుచూడుము.

తే. గీ. కోపమున నాదుభార్యచేఁ జీపురాని
శక్తిరూపము ధరియించి సాహసమున
నన్నుఁబాదుసమయమున నామొగమున
నెట్టిచాయనిల్చునో యిప్పుడట్టిచాయ
దాల్చి చనుచుండె ద్యుమణి యస్తగిరికడఁగో.

ఇంకమన మింటికేఁ బోవుదమురండు (అందఱును నిష్క్రమింతురు)

రంగము.

[గౌతమునియాశ్రమము, ప్రవేశము, గౌతముడు, అహల్య.

అనుబంధము. (5)

గౌత—

ఉ. కోమలిచేలవాచు బహు గుంజడదారిని నన్నుఁ గూడి యు
ద్దామమ్ముగోరగాదియుత ధారుణిబత్రిఫలోపహార దీ
క్షామహినుండిసి వకట సర్వధరాతలభూరిరాజ్య ల
క్ష్మి మహాసియుండు కానిసఁ జెందపుగా యిటువంటిదుస్థితుల్.

అహ—ప్రాణేశ్వరా! నీవు జడదారివగుము. మహారాజువగుము. అగ్నిహోత్రుని సాక్షిగ నన్ను నీవు పెండ్లాడితివి. నీవే నాకు దైవంబవు. భవద్దివ్యచరణారవిందసేవతప్ప నన్యమేమియు నాకక్కఱలేదు.

గౌత—సతీమణీ! నీవాక్యమెంతయో నాకు సంతసము గొలిపినది. కాని

సీ. వాసయోగ్యంబైన భవనంబులుండవు,
రమణీయమౌ కుటీరము తప్ప
వీనులకింపైన వీణారవము లేదు,
భయము గొల్పెడి మృగారవము తప్ప
కడుపార భక్షింప గాభోజ్యముల్ గల్గ,
వనితహాకిందమూలములెగాని
పవళించుటకు మేటి పానుపులుండవు,
శతదర్భశయ్యన సంతతమెగాని

తే. గీ. హాయిగా విహరింపను ద్యానవనము
లుండవు భయంకరమ్మగు వనోర్విగాని
యకట! చెపనెవ నన్నుఁ బెండ్లాడినట్టి
సత్ఫలంబిదియా నీకు సారసాక్షి.

ఏమహారాజునైనను నిను వివాహమాడియుంటివేని, యెట్టిసౌఖ్యములఁ బొందుచుండుదానవో కదా!

తే. గీ. బ్రహ్మపుత్రివి సౌందర్య । వతులయందు
నగ్రగణ్యవు నవ్య సు । వర్ణ గాత్రి
హస్తమునఁ బట్టి నను బెండ్లి । యాడి సౌఖ్య
మేమి యొందఁగఁ గంటివి గదా । యిందువదన.

అనుబంధము. (6)

అహా—నాథా! నిన్ను నాశిషయమున యట్లనుచుండవలదు. అశాశ్వతము లగు సౌఖ్యముల నేనాశించుదానను గాను. మహాత్యపోధనుఁడవగు నీవు నాకు భర్తవగుటయే, నాపూర్వజన్మ ఫలమని తలంచెదను.

తే. గీ. ధనములేనివాఁడైన ని । ర్గుణుఁడైన
కలుషచిత్తుఁడైన పరహితుఁడైన
గామ మత్తుండైనను । గాంత కెపుడు
భర్త యొకఁడే యనుచు దలపంగ । వలయుఁగాదె

కాంత—నా కమలాక్షీ! నీచిత్తవృత్తి కెంతయు సంతసించితిని.

తే. గీ. సతికి బతికంటె మఱియొండు । గతియు లేదు
పతికి సతి కంటె వేఱొక । ఫలము లేదు.
పుష్పమును తావియును బోలు । పొలుచు కరణి
వెలది! యిరువురు నేకభా । వింప వలయు.

సంపత్కరమును, బహుసుఖాస్పదంబును, గృహశాలమును నగు పతి సేవకంటెఁ బడఁతికి దపము లేమున్నవి,

తే. గీ. కాంతునకు సేవ లొనరించి । కామె జగతి
మున్ను సావిత్రి దేవతా । ముఖ్య యయ్యె
గాన, రమణి రో పాతివ్రత్య । కంటె నితర
దైవమున్నదా సతులకుఁ । దలఁచి చూడ.

పతికనుకూలవతియై వర్తించుసతియే సాధ్వియనఁబడును.

సీ. వరసుమస్తోమయుక్తవర్తనమైభవ్య,
మహితవాసనచొప్పు మగువ మగువ
పంకజస్పర్శస్వభావార్తయైపతి,
సన్మానమువహించు చాన చాన
ఘనపావనస్ఫూర్తి గానిని జేపిప్రియ,
చర్యానుగుణయైన శ్యామ శ్యామ
జనకసత్వవిచార మునుబూనకీర్తిస్థి,
తాత్మయైమనునట్టి యతివ యతివ

తే. గీ. వల్లభామోదకరణభావమున నంద
మగుసతీమతియే సతి యగును; నిట్లు
జగతివర్తించుభామయే సాధ్వియనెడి
పేరఁబరగియశముగాంచు విస్ఫురిమోప్తి.

అనుబంధము (7)

అహ—నాథా? సాధ్వీలక్షణములు నీవలన నెఱింగి నేను ధన్యనైతిని.
నీవు తపోధనుఁడవై కాషాయాంబరములఁదాల్చియుండఁగా నే
చీనిచీనాంబరముల ధరింపనేల? ఈ భూషణంబులేల? నేను
గూడ నారచీరనే గట్టి నీపాదసేవఁ జేయుచుందును.

గౌత—సతీమణీ! నావలె నీవుగూడ నుండనేల? నీ వేషము నాతప
మున కేమియు నంతరాయము గలిగింపదు.

అహ—

ఉ. ఆర్యులటన్న సువ్రతము లన్నను దేవతలన్న శాశ్వతై
శ్వర్యములన్న నిర్మలయశంబులటన్న శుభంబులన్న, స
త్కార్యములన్న భాగ్యసుకృతంబులటన్నను నాకునీవెయో
యార్య! త్వదీయదివ్యవిమలాంఘ్రిసుసేవయె నేను గోరెదన్.

గౌత—రమణీ! నీవు కృతార్థురాల

ఉ. మామకభాగధేయగరి ? మంబుననాకును బత్నివైతివో
తామరసాయతేక్షణ ము ? దంబుజగంచెదు నెంతయైన
త్యామితవైభవంబు నెస ? నశ్వుగ్రుతాయుఁడ నాను నింక నీ
భూమిని నిన్నుఁగూడి ముని ? పుంగవనాముము దాల్చిసుందరీ.

మదీయదివ్య తపఃప్రభావంబున భవదభీష్టములు నెఱవేరుచుండును.

అహా—కృతార్థురాల నయితిని.

గౌత—సతి! స్నానార్థమై నదికేగి రావలయునుగదా! రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





# అహల్యాశాపవిమోచనము

## ద్వితీయాంకము

### రంగము (1)

[ఇంద్రలోకము - మందిరమున - ఇంద్రుఁడు - ప్రవేశము]

అనుబంధము (8)

ఇంద్రు—(తనలో) చిత్తమును శాంతపథమునఁ బెట్ట నెంతప్రయత్నించినను సాధ్యముగాకున్నదికదా! ఆయహల్యా సౌందర్యాకృతినాకన్నులకుఁ గట్టినట్లున్నది.

సీ. పల్లవాధరికేశ బాధంబు వీక్షించు
సారంగపాళి సాక్షాత్కరించు
నజ్ఞాతదశనేత్రి యమలవాక్యంబుల
సరణిగాంచహరి ప్రసన్నమొందు
నంగనామణిముఖం బనలోకమునసేయు
నలుమొగంబుల వేల్పు నిలచుముందు
చకితాక్షి దేహ సౌష్టవ మెంచినను హేమ
వర్ణంబుగుత్తియు బ్రవాహమగును

తే. గీ. భామపదముల దలపోయ వారిజముల
గరిమగను పట్టు సుందరి గనుపమెంచ

రాజహంసవ్రజంబులు రహింపఁజొచ్చు
నింక నాకాంత సౌందర్య మెన్నఁదరమె.

ఆశరదిందు ప్రతిమానసుందర వదనారవిందయగు నహల్యం గూడక నేనుజీవింపఁగలనే?

అనుబంధము (9)

[మణికంధరుఁడు-ప్రవేశము]

మణి—(ఇంద్రునిఁజూచి-తనలో) ఈమహేంద్రుఁడు సర్వమునుమఱచి, చిత్తమంతయు నహల్యయందే చేర్చియున్నాఁడు. ఒకనిని వివాహమాడిన యాకాంతకై యీతడింత పరితాపమంద నేల? ఇది యెవ్వరైనవిన్న నవ్వుదురనియైన తలంపక యున్నవాఁడే! అమరలోకసామ్రాజ్య లక్ష్మీధవుండగు మహేంద్రుఁడొక్క సామాన్యవనితకై యిట్లుమోహవశుఁడై సమస్తకార్యములను మఱచెనని యమరులెల్లరును గేలిసేయరా? (ఇంచుక యాలోచించి) ఇంతకును దీనికిఁ గారణమా దిక్కుమాలినమన్మథుఁడు, వానికేమియుఁబనిలేదు. ఎప్పుడుఁజూచినను నిట్టికృత్యములనే సేయుచుండి స్త్రీపురుషులనో యేడిపించుచునే యుండును. వానిధాటకు నెట్టివారును నాగఁజాలరు.

తే. గీ. కామరహితులైనను మోక్ష కాములైన
నిశ్చలాత్మకులైనను నిపుణులైన
వివిధ వేదాంత శాస్త్రార్థ విదులమైన
దర్పకుని బాణహతులకు దాళఁగలరె.

తే. గీ. దవశిఖిని నార్పవచ్చు నుగ్ర తాపసుల
కోర్వవచ్చును; ఘోర మృత్యువును గెల్వ
వచ్చు; గరళంబుఁ గ్రోలంగ వచ్చుగాని
కామునివిశిఖరాహతిఁ గడవలేరు.

ఆమన్మథుని జయించినచోఁ బ్రపంచమంతయు గెలిచినట్లు.

చ. గురులనుఁగొల్చి వేదముల । గూఢతరార్థ మెఱుంగనేల; శ్రీ
హరిని భజింపనేల యమ । రాపగలోఁ మునుఁగంగనేల; సాం
పరయఁగ బుణ్యతీర్థముల । నన్నియుభక్తినిమెట్టనేల; యా
మరుని జయించునట్టి యల । మానవుఁడే కడు ధన్యుఁడయ్యెడిన్.

(ఇంచుకయూరకుండి) కానిమ్ము. ఆమన్మథుఁడీయింద్రునిచే నెట్టినాటక మాడించుచుండునో చూచుచుండెదనుగాక! (మూలడాగియుండును)

ఇంద్రు—(తనలో) అక్కటా! ఎక్కడనున్నను యహల్యా సౌందర్యాకృతి నాచిత్తమును నాకర్షించి వేయుచున్నది.

సీ. ఏచాయకునుబోవ । నాచాయఁగనిపించు,
మదిరాక్షి సుముఖేందు । మండలంబు
నేపంచకేఁగిన । నాపంచఁగననౌను;
బాలతి క్రీఁగంటిచూ । పులపసందు
నేక్రేవకునుబోవ । నాక్రేవదోఁచును,
నీలకుంతలఘన వే । ణీభరంబు
నేయూరకరిగిన । నాయూరఁజూడనౌ,
కోమలాంగియురువ । క్షోజపఙ్క్తి

తే. గీ. భళిర! ఏప్రక్క కరుగ నా । ప్రక్కయువిద
హంసనడకల గతికాన । నగునికేమి
సేతు; వెలదిసౌందర్యంబు । చిత్తమందు
గాఢధైర్యలతల్గోయఁ । గాఁ దొడఁగె.

మణి— (తనలో) మన్మథునిచేతిలో నీమహేంద్రుఁడు కీలుబొమ్మయై నాఁడు అహల్య పరదారయని యైన జ్ఞానమీతనికి లేకపోవుచున్నదే. "అత్యుచ్ఛ్రియః పతనహేతుః" అన్నట్లు అంతకంతకీ మోహమధికమై తుదకీతనిని నఱుకంటించునేమో యని సంశయించుచున్నాను.

ఇంద్రు—అయ్యో! విరించిచేసిన శపథంబుననుసరించి యహల్య గౌతమునికైకొనెనుగాక! నిశ్చయముగా నామెకాబడుగు జడదారియం దిచ్చలేదని నాకు నమ్మకము గలదు. అట్టిచో నేనియ్యెడకు రాకుండ, గౌతమాశ్రమప్రాంతమునందే వర్తిలుచున్నచో, నెప్పుడో సమయము గనిపెట్టి యమ్మగువమిన్న నన్ను గృపాదృష్టిని వీక్షింపక యుండునా?

మ. తరుణీంబాసి యిటులవచ్చితిఁగటా ! తద్వక్త్రముఁ గాంచు చా
సరసన్ వర్తిలుచున్న నా సతికటా ! తుషార్త్రశోభిల్ల, న
న్మరలిన్ నన్నొకసారి గన్గొనినచో ! మన్మానసాలీఢ దు
ర్భరమోహాంబిసుమంతపోవుగద, నే ! రాఁజెల్లునే వెఱ్ఱినై.

ఆపర్వేందుముఖినిఁ దిలకింపనిచో నామేను బ్రాణములు నిలుచునని తోఁచదు. (ఇంచుకయూరకుండి) అక్కటా! ఈమన్మథుఁడు నాపై దాడివెడలెనే!

ఉ. చిత్తజుఘాతబాణముల ! చేఁగ నుడస్సిన నాకు మున్ను నే
హా త్రిశచీయటంచు సతి ! నంచితప్రేమను బిల్చునట్టు లే
నిత్తరిబిల్వఁబోవగను ! నేమివిచిత్రము గాని నాకు నా
చిత్తరియాయహల్య మది ! చేరొక్కనవచ్చుచునుండె నక్కటా.

(మన్మథునుద్దేశించి) హా! మన్మథా! నన్నేల యీరీతి బాధించెదవు. ఒక్కింతకాలము నీశరవర్షమునాపై నాపి, నామనంబు జూఱగొన్నయహల్యపైగూడ గుప్పితివేని నేను కృతార్థుడనగుదును. (ఆకాశమువంక జూచి)

తే. గీ. ఆవనిఁజారచోరులకు ధై ! ర్యంబుసడల
కుముదసంతతి కెల్లను ! గోర్కెలీల
గాముకజనులచిత్తముల్ ! గలచివేయ
జంద్రుఁడుదయించెఁ గాంతిని ! సాంద్రుఁడగుచు.

ఓశశీ!

తే. గీ. చల్లదనము నొసంగును ఽ చంద్రుఁడనుచు
జనములాడు వాక్యంబుల ఽ సత్యమయ్యె
జల్లదనమింతయునులేదు ఽ చంద్ర నిన్ను
మింటఁగనుఁగొన్ననాఁడును ఽ మంటఁగొదవె.

తే. గీ. నన్నుహసియింపఁగాఁజాలి ఽ నట్టియాడు
హల్యకై యత్నమొనరించి ఽ యందలేక
పోతివిఫలంబని యలుకఁ ఽ బూనినన్నుఁ
దాపవార్ధిని ముంచుటఁ ఽ దగునె చంద్ర.

అక్కటా! మన్మథుఁడు తనమామయగు నీచంద్రునిసహాయముతోఁగాని మఱింత వేధించుచున్నాఁడు. (మన్మథునుద్దేశించి)

తే.గీ. మామయగు నాకుశశియని ఽ మదినిఁబొంగు
చుంటివంతియే; యానిజం ఽ బుదెలియవయి
తకట! యాతండు నీవైరి ఽ యైనగరళ
కంఠుజడలోన దూరుట ఽ గాంచవేమి.

మారా! నేను నీకుఁ జుట్టమనగుననియైన భావింపక యుంటివే. (ఆలోచించి) నేనెంత వెఱ్ఱివాఁడను.

తే. గీ. అఖిలదేవతాముఖ్యులై ఽ యశమునెంతొ
గాంచునీవారికే పార ఽ గతములేని
కట్టడివిమార నీకు నేఁ ఽ జుట్టమనని
చెప్పుకొనుటెల్ల నాకౌర ఽ చేటుగాదే.

మ. హితులన్ బంధులఁదల్లిదండ్రులవెసన్ ఽ హృద్వ్యాధిశంకింపక
ప్రతిమక్రౌర్యముబూని గాసిల నొన ఽ ర్చన్ జెల్లునే యంచునో
రతినాథా నను దూరనేమిటికి సాం ఽ ద్రప్రీతితో నీవు సం
తతముం జేయు నిశాటమైత్రి యదివ్య ఽ ర్థంబౌనె లక్ష్మీసుతా.

చ. అసిశమునబల్మధువ్రతి ను । ణాఢ్యుఁడనై మధుమత్తశీలజీ
వనకలికైకగంధవహ । వాహుఁడనై కరినాత్మకుండనై
వనచరపాళిసాయమున । బంధువధం బొనరించుచుంట నీ
మనమున నేవిధంబున స । మంగిత సత్కృపపుట్టుమన్మథా.

చ. అతిరతివిప్రయోగుల మ । హా మదచిత్తుఁడవౌచు వేచు దు
ర్మతివని కాదెనిన్ను, ను । మాపతికోప పరీతచిత్తుఁడై
తతనయనాగ్నికీలికల । దగ్ధునిఁజేసెను గాకయున్న నీ
వతనికి వైరివేయుటుల । హానియొనర్పఁగ మాకుమారకా.

(ఇంచుకయూరకుండి) అబ్బా! ఏమి ఈతాపము అహల్యావదనాటీ ముఖారవిందము వీక్షించినఁగాని చల్లారదు. హా! యహల్యా! యహల్యా! (మూర్ఛిల్లుచున్నాఁడు)

మణి—(తనలో) అహల్యపైనున్న మోహమీతనిని ప్రపంచమునే మఱపించుచున్నది. ఈతఁడింత వివేకశూన్యుఁడయ్యె నేమోగదా? ఇందులకే పెద్దలుమోహముగుడ్డిదియని చెప్పిరి. కాకున్నచో దేవేంద్రుఁడేమి? పరదారను గామించి యాకీర్తిని సర్వమును మఱచి యుండుటేమి? ఈతఁడెప్పుడుచూచినను నహల్యరూపమునే వర్ణించుచుండును.

సీ. అలివేణికుటిలకుం । తలముల శ్లాఘించు,
చంద్రాస్యముఖకాంతి । సంస్తుతించు
జలజాక్షివీక్షా । చలనంబు నుతియించు,
కంబుకంధరగళ । గరిమబాగడు
పల్లవకరహస్త । వైభవంబునుమెచ్చు
జక్రిస్తనివరకు । చములఁబొగడు
తలిరుబోఁడిఘనని । తంబమ్ములను నెన్ను,
గలికిపాదజలజ । ములగణించు,

తే. గీ. ముదముపహరించు, బంకించు భూరిశిరము
దరుణి జేసినధాత చాతురినిదలఁచు
బంచశరజాత శరజాత భగ్నుఁడగుచు
నీమహేంద్రుండహల్యకై యేమివింత,

(ఇంద్రునిసమీపించి) మిత్రమా! మహేంద్రా!

ఇంద్రు——(కన్నులదెఱవక యే) నాపాలిటియహల్యయా నేమి?

మణి——నీకు జగమంతయు నహల్యామయముగానున్నది కాఁబోలు. చాలుఁ జాలు, లెమ్ము.

ఇంద్రు——(చూచిసిగ్గుపడుచు) మిత్రమా! నీవా? ఈసమయమున నేలవచ్చితివి?

మణి——ఏమి! రాకూడదా! అహల్యయొద్ద కరుదెంచునా యేమి?

ఇంద్రు——ఈనిర్భాగ్యున కాభాగ్యము గూడనా?

మణి——ఈనాకలోక సామ్రాజ్యము లేకపోయినను నహల్యనొకసారి దియఁజూచినఁ జాలుఁ గాఁబోలు. ఆహాహా! ఎంతయవివేకివైతివి.

శా. లేరే పెద్దలునీకుబుద్ధిఁ దెలుపన్ లేకుండిరేయాపురీ
వారిం జేరవా ధర్మమార్గనిరతిన్ వాంఛింపవో కానిలో
నీరీతిన్ బరదార, లోఁ దలపగా నీవెంతువే, యక్కటా
సారాచారమె! ధర్మకార్యమె! యికన్ జాలింపుమీ కోరికన్.

అను 10

నేనిట్లు పలికితినని నాపై నాగ్రహింపవలదు. నీశ్రేయస్సు గోరినవాడను గనుక జెప్పితిని.

ఇంద్రు—— సఖుఁడా! మణికంధరా! నాస్థితింగూర్చి యేమిచెప్పుదును?

మ. తరుణీకోమలపద్మపత్రనయనన్ ధ్యానింపగానే కటా
స్మరుఁడుగ్రుండయి వేఁడిమోపులడరిం పన్ దచ్చితాస్త్రాళి, చె

చ్చిరబాధింపం దదీయబాధకు ధృతి వీడి హీనచిత్తుండనై
ధరపైవ్రాలితి నీవిధంబునను మిత్రా! యేమి వాక్రుచ్చెదన్.

మణి—చాలుంజాలు, ఎవ్వరైనవిన్న నవ్వెదరు. ఏమి! ఆమన్మథుడు, భయభక్తులులేక నీవంటివారలం గూడ వేచుచున్నాండు. పోని మ్ము, బ్రహ్మచారుల నెవ్వరినైన బాధించుచుండినచో నంతగా వానివిషయమై యాలోచింప నవసరములేదు. ఆ, అనునప్పటికిగడ గడలాడుచుం జేతులుకట్టుకొని యెదుట నిలంబడు, యూర్వశి, మేనక, రంభ, ఘృతాచిమొదలగు నమరవేశ్యలును, బట్టపుదేవియగు శచియునుండంగా, పరదారయగు నహల్యంగూడుమని నీకీరీతిని బోధసేయునా మదనుండెచ్చటనుండెనో నాకుంజూపుము. జుట్టుపట్టుకొని యీడ్చుకొనిపోయి నాగృహిణి యెుద్ద నిలబెట్టెదను. చీపురుకట్టతో నీపుశుద్ధిజేసి యెన్నండును నిట్టిపనులు చేయననిపించి విడిచిపెట్టుదను.

ఇంద్రు—అధికసంతాప వార్ధిలో మునింగియున్న నామదికి నీపరిహాస వాక్యములు నాటునా?

మణి—పరిహాసవాక్యములుగావు. నావలన దోషమున్నను లేకపోయినను, ననుదినమును ప్రాతఃకాలమునం గాల్యకృత్యములు దీర్చికొనినపిదప, మాయావిడ నన్ను శృంగారపుకట్టతో రెండుదెబ్బలుకొట్టి ముద్దాడుచుండుట యాచారము. నేను నీమూలము నమతిరెుకసారి యామెసేయు దండనకుం బాత్రుండనుగావలసివచ్చినది.

ఇంద్రు— అక్కటా! నామూలమున నీవు భార్యచే దెబ్బలుతింటివా? ఈవింత యేమి?

మణి—వింతయేమున్నది? నీవు నాకాప్తసఖుండవని నాభార్యకుం దెలియునుగదా! ఈసంగతియట్లుంచుము. ఎట్లు తెలిసెనోగాని,

యహల్యకై నీవందుచున్న పరితాపమును గూర్చి వినెను. "ఆ కుసెలలు స్నేహముజేసిన వారు వీరగుదు"రని పెద్దలు చెప్పిరి. పరదారకై పరితాపమందు నింద్రునకు నీవు హితుఁడవై యుం టివి. నీవుగూడ నట్టికృత్యముల నెప్పుడైన సేయఁదలంచెదవే మో "యని, మిత్రమా! చెప్పిన నమ్మెదవో, నమ్మవో, నేడు మధ్యాహ్నమున భోజనానంతరమున, తిన్నతిండి సమస్తము 'జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణ" మగునట్లు దేవనిగ ఒకగంటసేపువ ఱకు బాధికట్టుకొన్న భార్యవ్రుండఁగా, బరకాంతలఁగూడుటకై తలంపవలదు" అని మేఘగంభీర స్వరముతోఁ జెప్పెను.

[తెరలో]

ఏమే! వాసంతికా ఇంతపొద్దుపోయినను ప్రాణేశ్వరుఁడు శయనమం దిరమందే యుండెనా?

మణి—మిత్రమా! కొంపమునిఁగినది. శచీదేవి యిట్లు వచ్చుచున్నది. నీపరితాప మామెకుఁ దెలిసినచో నామెహృదయమున, బుం డుమీఁదకారము జల్లినట్లుండును. లేచి కన్నులు దుడుచుకొని కూర్చుండుము.

ఇంద్రు—మణికంధరా! మాటలసందడిని నాపరితాపమును గూర్చి యామెకుఁ జెప్పెదవేమోసుమా!

మణి—నేను వెఱ్ఱివాడనని తలఁచితివా యేమి? (తనలో) రహస్యము లు దాచుటలో నాయంతటివాడు లేఁడు. రెండవనారదుఁడనే.

[శచిప్రవేశించును]

శచి—(ఇంద్రునిఁజూచి) ప్రాణేశ్వరా! ఇంతరాత్రియైనను భోజనమున కు లేవక శయనగృహమునందే యుంటివేల?

ఇంద్రు—దేవీ! నర్మసఖుండగు మణికంధరుఁడేదియో చెప్పుచుండగా వినుచుంటిని.

మణి—(తనలో) పాపాలభైరవుడను నేనుంటినిగదా. (ప్రకాశముగా) అమ్మా! నా సంభాషణ నీవెఱుఁగనిదేమున్నది? మనస్సులో నేదైన చింతయున్నవారికి కాకలియుండదుకదా!

ఇందు—(తనలో) ఈతఁడు నెమ్మదిగా నాగుట్టును బయలుపెట్టును కాబోలు.

శచి—త్రిభువనాధీశ్వరుండగు నీతనికిఁగూడ చింతయేనా?

మణి—ఇట్టిమహారాజాధిరాజులకే చింతలధికముగా నుండును.

తే. గీ. పాలననుగూర్చి యొకచింత । పగఱపైకి
వత్తురేమొయనుచుఁ జింత । ప్రజలసుఖము
లందుమార్గంబు నీక్షించు । నట్టిచింత
యన్నిచింతలకంటెను । నతివకొఱకు
పడెడుచింతయధికమౌచు । బరఁగుఁగాదె.

శచి—ప్రస్తుతము నాప్రాణేశ్వరునకు శత్రుబాధయేమియు లేదు. పరిపాలనావిషయముంగూర్చి యందఱును శ్లాఘించుచునే యుండిరి. నీవు చెప్పిన చివరచింత యీతనికేమైన నున్నదేమొ నే నెఱుఁగను.

మణి—తల్లీ!

తే. గీ. మబ్బులోపల ప్రొద్దును । మనసునందు
నాటియున్నట్టియూహయు । నీటిజాడ
యాకసంబునఁ బులుకేగు । నట్టిత్రోవ
గన్గొనఁగ ధాతకైన శ । క్యంబుగాదు.

శచి—మణికంధరా! నీవు చెప్పినట్టిమాట నిజమే (ఇందునిఁజూచి) మనోహరా! నీకేమైనఁ జింతయున్నచోఁ జెప్పుము.

ఇందు—సాక్షాదిందిరాదేవి కైవడియగు నీవు ప్రేయసివై యుండగా, చింతకూడనుండునా?

మణి—(తనలో) ఈయిచ్చకపు మాటలకేమిలే.

శచి—నాథా! ఎట్లయినను నీ మొగము విచారాక్రాంతమై యున్నట్లు తోఁచుచున్నది.

ఇంద్రు—సతీ! మతేమియును లేదు.

మణి—అమ్మా! మధ్యాహ్నము మేము నందనవనమున కేగినప్పుడు వేడిగాలి తగులుటచే నట్లుండనోపు.

శచి—మణికంధరా! నాథుఁడీ దినంబున శయనమందిరమువిడిచి యావలకేపోలేదు. నీవుగూడ నసత్యములాడుచుంటివా!

మణి—(తనలో) టంకము అతకలేదు. జారిపోయినది. (ప్రకాశముగా) తల్లీ! మొన్నమధ్యాహ్నం వేడిగాలికి.

శచి—మణికంధరా! ఎక్కడిమాట.

మణి—పదిదినములక్రిందట మృణ్మయపాత్రిబగులగొట్టితినని నవ్వుచు నాభార్య నావీపుపైగొట్టిన దెబ్బలనొప్పియింకను నట్లేయున్నది.

ఇంద్రు—రమణీ! ఈపరిహాసవాక్య ప్రియునితో నేమి?

శచి—నాథా!

తే. గీ. భూరిముదమున రాజిల్లు ◊ మోమునేఁడు
వాడియుండెను నిశియందు◊ బద్మమట్లు
చిత్తమందొకకాంతకై ◊ చింతఁజేర్చి
యున్నవిధమునాకును దోఁచు ◊ చున్నదిపుడు.

మణి—అబ్బబ్బా! యెంతమాటఁ బలికితివమ్మా తల్లీ! మామహేంద్రునియెడల నట్టివిధ మెప్పుడయిన గనిపెట్టితివా?

శచి—అహల్యను నెట్లయినఁ గైకొనఁదలచి యష్ట కష్టములందుటనే నెఱుఁగనా?

మణి—(తనలో) ఆయమహల్యయేయింతకొంపతీసినది. (ప్రకాశముగా) అమ్మా! నీవావచించిన ప్రేవ్రుల లెక్కడుదావు.

అనుబంధము (11)

శచి—నాథా! అహల్యంగూర్చిన చింత యేనా నీమనంబున నాటియున్నది. ఇంకను నామెంగూర్చి పరితాపమేల?

మ. వరియించెంగద గౌతముం రమణి, యవ్వృద్ధాత్ముకై యింక నీ
కరణిం జింతిలనేమిలాభమగు లోకంబిద్ది యాలించినం
బరిహాసంబొనరింపదే యిటు సుపర్వశ్రేణికిం నాథుడే
పరదారం గని మోహమొందెననుచుం భావింపగా వల్లభా.

ఇంద్రు—మగువమిన్నా! మణికంధరుని పరిహాసవాక్యములాడుటయు. దదనుగుణముగా నీవు నన్నడుగుటయు సరిపోయినది.

శచి—నాథా! ఇట్టిసంగతి దాచినను దాగదు. నీ మొగము చెప్పుచున్నది

మ. శ్రీ—(తనలో) మొగముజూడఁగనే మోకాళ్ళవాపు తెలియదా యేమి?

శచి—(ఇంద్రునిఁజూచి)

ఉ. చెప్పకయుండినం వినుము చెప్పుచునున్నది నీ మొగంబె యా
గొప్పులకుప్పపైననిటు లూరకచిత్తము శేర్చితంచు; నీ
కిప్పని చెల్లదంచు నిపు డెంతయు జెప్పగ సాహసించు నా
తప్పు శమింపు మీకృపను ధర్మముగాదిది ప్రాణవల్లభా.

మణి—(తనలో) ఈమె నిజము గనిపెట్టినది. ఈమె వాక్యము లీతని చిత్తము నేమయినఁ ద్రిప్పఁగలుగునేమో. (ఆలోచించి) మఱే! ఇట్టి విషయములందెవ్వరు చెప్పినను ప్రయోజనము లేదు.

శచి—(ఇంద్రునిఁజూచి) నాథా! నావాక్యములకుఁ బ్రత్యుత్తరమీయవేమి?

ఇంద్రు—సతీ! నీవేల యీరీతిఁ బలికెదవు. (తనలో) ఇట్లుఁ జెప్పెదఁ గాక. (ప్రకాశముగా)

ఉ. ఏనల యింతిఁ జేకొనఁగ నెంతయు యత్నమొనర్చినాను గా
నీనగుబాటు నాకొదువ నీరజనేత్రి నహల్యనిచ్చె నా
మౌనికిధాత యేమనుడు మానసమందునఁ జింతదీనికిన్
బూనితిగాని నాతికయి పొందుదునే పరితాపమింతయున్

అష్ట దిక్పతులు సేవింప, మహావైభవము నందుచు, నమర లోకము పాలించు నన్నుఁగాదని యాయహల్యను గౌతమున కొసంగి ధాత నన్నుఁ జిన్నబుచ్చినందుకుఁ జింతించుచుంటిని. ఈపరాభవాగ్ని యెట్లు జల్లారునాయని మార్గమరయుచుంటిని.

మణి—మిత్రమా! ఇందు ధాత ననవలసిన పనియే లేదు. ఆతఁడు తన ప్రతిజ్ఞ ననుసరించి చేసినాడు.

శచి—నాథా! ఆమాట నిశ్చయము. ఇంక నహల్యా నామమును మనమున మరచిపొమ్ము.

ఇంద్రు—(తనలో) త్రిలోక సౌందర్యవతియగు నాయహల్యను మఱచిపోవుటా? ఏమాయోపాయము చేతనైన నాసుదతిం గూడక జీవింపగలనా?

అనుబంధము (12)

శచి—మనోహరా! వివాహము గాకయున్నచో నామెవిషయమై యేప్రయత్నము జేసినను జేయవచ్చును. ఇప్పుడామె గౌతముని పత్నియైనది. ఒకవేళ నామెంగూర్చి నీపిట్టి ద్రోహచింత నైన మనంబునఁ దలపెట్టియుంటివేమో? అట్టి దేదియుఁ జేయవలదని నాప్రార్థన.

మణి—(తనలో) నీవు చెప్పిన వినునా? మొట్టికాయ తగిలినఁగాని బొప్పికట్టదుకదా!

## అనుబంధము (13)

శచి—

చ. పరువునశించుగీర్తి మెడఁ బాయును మానసమందుఁజింతచే
కురుసు, బుధుల్ హసింతు, నిజకోమలిగుందును; బంధువర్గముల్
గరుణఁద్యజించి దూరుదురు ఘనంబునుగల్గును గానఁ నెందునుఁ
బరవనితారతంబు గుణవర్యులకుం దగునే మనోహరా.

ఇంద్రు—రమణీ! నేనవివేకి ననియా నీతలంపు.

మణి—(తనలో) అబ్బో! రోషముగూడనా! (శచీదేవింజూచి) తల్లీ! చాలా ప్రొద్దుపోయినది. ఇంటికి జేరుకొనక పోయితినేని, యీరాత్రి మాఆబిడ నాకు పిండము పెట్టక యుండుట సరి కదా! వీపుమీద నగారావాయిద్యముతో, పెద్దలను జ్ఞాపకం చేయును. (ఇంద్రునిఁజూచి) మహేంద్రా! ఇంటికి నెమ్మదిగా చేరుకొందును. ఆజ్ఞనొసంగెదవా? నీవుగూడ, రెండుమెతుకులు కొఱికి, స్వస్థతగాయున్న విచారము విడిచి శయనింపుము. ఆరు బయలున మాత్రము పరుండవలదు. ప్రస్తుతము నీవు న్నస్థితికిఁ జంద్రకిరణ ప్రసారము వికటింపఁగలదు.

ఇంద్రు—నీవు పరిహాస వాక్యకుశలుఁడవు.

మణి—ఇంక నేఁబోయి వచ్చెద. (నిష్క్రమించును)

శచి—నాధా! భోజనమునకు లెమ్ము.

ఇంద్రు—ఇదిగో! వచ్చుచున్నాను.

(ఇరువురును నిష్క్రమింతురు)



రంగము (2)

[గౌతమాశ్రమ ప్రాంతవనము:— ప్రవేశము:—ఇంద్రుఁడు]

ఇంద్రు—(తనలో)

చ. ఘనకచ యా యహల్యనిట గ్రమ్మఱఁ జూచుట యుక్తమంచు, నే
ననుకొనినట్లు నామనము నందొక కోరికఁ బుట్టఁజేసి; మా
తనయుఁడు బోధసేయుచుఁ బదాఁ వయించును నెట్టుచుండె; న
వ్వనితమెలంగు నియ్యెడకు వచ్చితిఁ జెచ్చెర, మోదమేర్పడన్.

ఇదియే గౌతమాశ్రమ ప్రాంత వనము. ఇచ్చటనేను వేచియుంటినేని, యమ్మెలనాగ, పుష్పాపచయార్థమైనను రాకయుండునా ?

ఉ. అచ్చరమచ్చకంటుల నెమి యూరకను లారసియుంటిఁగాని, నా
కిచ్చజనింపదయ్యె తర ళేక్షణ నిన్నును కన్గొనంగనే
యిచ్చజనించె దైవకృత మెవ్వరు దప్పగ సేయువచ్చు నే
నచ్చుగఁ గాంతకుఁ నుడివి నన్ విరికోరికఁ దీర్చుకొందునే.

[తెరలో]

మునిపత్నీ! అహల్యా! ఆదెసకుఁ బోవుదము. రమ్ము.

ఇంద్రు—(విని) ఎవ్వరివో! స్త్రీవాక్యములు వినవచ్చుచున్నవి.
(పరికించి) ఎవ్వరివో యననేల ?

చ. అకలంకోజ్జ్వలగాత్రియై వెలయునా యంభోజపత్రాక్షి మా
మకసమ్మోహకళా విశేషములు బెం పంజాలి భాసిల్లు నా
చకితాక్షీమణి యా యహల్య, మదభీ ష్టంబిప్డు చేకూర్ప, నెం
చి, కృపన్ వచ్చుచునున్నదంచు మనగడున్ జిత్తంబునం దెంచెదన్.

అనుబంధము (14)

(చూచి) అదిగో! ఆమె సఖీపరివృతయై యిట్లేవచ్చుచున్నది. ఆహా! ఏమి! ఈ సౌందర్యము.

సీ. అలదేవదానవు । లబ్ధిమథించుచో
        తనరారుమోహినీ । తరుణియనఁగ
భారతీ పతితన । ప్రౌఢిజూపరచింప
        బాలుపొందుఁ జాలించు । బొమ్మయనఁగ
వార్ధికాంబుదసమ । వాయాంతరంబున
        దీపించు క్రొమ్మించు । తీవయనఁగ
సుమశరాభిఖ్యను । సార్థకంబుగఁజేయు
        మరుచేతినాఅవ । శరమనంగ
తే. గీ. సఖియతోఁగూడి ముచ్చట । సల్పుకొనుచు
వనవిహారము సేయంగ । వచ్చెనదిగొ
నామనము చూరగొన్నట్టు । నాతిమిన్న
యందముల పేటి, యాయహ । ల్యావధూటి.

(ఇంచుక యూరకుండి) ఈమెతోఁగూడ చెలికత్తెగూడ వచ్చియున్నది. ఒంటిగనున్నచో నాప్రియత్నమున కనుకూలముగ నుండును ఇప్పుడు నేనేమి సేయుదును ? కొంతవఱకా వృక్షము చాటున వేచి యుండెదఁగాక.

(వృక్షము చాటున కేగును.)

[అహల్య విశారదతో ప్రవేశించును]

అనుబంధము (15)

విశా—చెలీ! అహల్యా! దురంత లతాంత నితాంత సౌరభాకాంత దిగంతంబును, నాగత నిరంతర దక్షిణవాత పూర్ణరోధోంతంబును, భృంగకోకిల శుకారవ చాలితదాంతసంతతి స్వాంతంబునునగు నీవసంతమెంతయు సంతసమైనఋతువుగదా !

అహ—అవును. ఈఋతువునందే వనములు కనులపండువగ నుండును. అటుజూడుము.

తే. గీ. సకలసురముని రాజపూ / జానిదాన
ములు మిళిందవజ్రనిధాన / ములు స్వదర్శ
నపరిభేదిత విరహిలో / కపరితాన
మానములు సూనములువొ ల్చె / మహితరుచుల.

విశా—బ్రహ్మపుత్రి! మార్గాయాసమున డస్సియున్న పాంథులకు జల్లనినీడనిచ్చు యీవటవిటపి యెంతవిశాలముగ నావరించి యున్నదో కంటివా?

ఇంద్ర—(తనలో) నేనిచ్చట నుంటుటయూ చెలికత్తెచూచెనా యేమి? అట్లయిన నేమైనమోసము సంభవింపగలదు. (మఱింతచాటున కేగును)

అహ—విశారదా! విమల సలిలాసారంబగు నాకాసారంబునుజూడుము తత్కాసారతీరమున మీనంబులఁబట్టుటకై, దొంగతపము సేయుచు వేచియున్న బకంబులఁగంటివా?

ఇంద్ర—(తనలో) నన్ను వీరుచూడలేదు. వెంటనే చెలికత్తె లేకున్న యనుకూలముగనుండి యుండునుగదా!

విశా—అహల్యా! వానికేమిగాని, అటుఁజూడుము. చిలుకముక్కులచే నొక్కబడి కెంపురుచు లీనుచున్న దాడిమీఫలంబులును, మార్గాయాస సంజనితతృష్ణావిదారణములగు నారికేళఫలము లును, కందర్పునితన విశిఖములకుఁబకును పెట్టు, కదళీతరువుల నుండు లేతయాకులును, మాధవపూజార్హంబులగు మాధవీ పుష్పములును, నెల్లెడనల్లిబిల్లిగనల్లుకొనియున్న మల్లెతీవెల నున్న పూలును, మిగుల సువాసనచే నెగడు పొగడులును, మరున్నిచేతి బాకులనంబకు గేదంగులును, గలిగి విలసిల్లు నావనపరిదేశమెంత రమణీయముగ నున్నదో!

అహ——విశారదా! మనము వచ్చి కడుదడవయినది. స్నానార్థమై నది కరిగిన నాథుండు వచ్చుచుండును.

ఇంద్రు——(తనలో) అక్కటా! ఈమె యాశ్రమమున కరుగును కాబోలు.

అహ——విశారదా! నీవాయుపవనమునకరిగి, యింపు, బరిపక్వఫలము లసంగ్రహించి. యాశ్రమమున కరుగుచుండుము. నాథునిపూజార్థమై నేపుష్పములు గోసికొని యీదారిని వచ్చెద.

విశా——మంచిది. (నిష్క్రమించును)

అహ——(పుష్పములు గోయుచుండును.)

ఇంద్రు——(తనలో) చెలికత్తె యరిగినది. ఈమె యొంటిగనున్నది. ఇది యేమంచి సమయము. నేనీమె యెకుటఁబడెదగాక.

తే. గీ. అమరలోకవిభుఁడు నేఁడ హల్యఁజేరి
తనదుకోర్కె దీర్చుకొనఁగ దలఁచెఁగాన
గాముడా! ముందునడుపుమీవు కరుణఁబూని
కాంతకునుగూడ మోహంబుఁ గలుగఁజేయు.

(అహల్యను సమీపించును.)

అహ——(ఇంద్రునిజూచి) కొంచెము దూరముగాఁబోయి (తనలో) ఎవ్వరీపురుషుఁడు (పరికించి) ఓహో! ఈతఁడ మరలోకప్రభుండయిన మహేంద్రుఁడు. ఈతఁడిచ్చటికిరాఁబనేమొకదా! (ఆలోచించి) ఏమైన నాకేమిభయము నాపనినేను జేసికొనెదగాక. (పుష్పములు గోయుచుండును.)

ఇంద్రు——(తనలో) ఈమెనన్నుఁ జూచియుఁ జూడని చందమున శిరమువంచుకొని పుష్పములఁ గోయుచున్నది. పలుకరించెదఁగాక. (ప్రకాశముగా) యోహారత్నమా! కుశలమా!

అహ——(తనలో) ఈతనికి నేనేమి ప్రత్యుత్తర మిత్తును. (ఇంచుక

యారకుండి) నిష్కల్మష చిత్తనగు నేనితనితో మాటలాడి నంటువలన దోషమేమి సంభవించును. (ప్రకాశముగా) మహేంద్రా! త్రిలోకనాథుండవగు నీరాకచేమేము ధన్యుల మగుదుము ఇచ్చట కనతి దూరమున నున్న మాయాశ్రమమున కరుదెంచి నానాథునిచేఁ బూజలంది, పొమ్ము.

ఇంద్రు—(తనలో) అహా! ఏమి యీవాక్చాతుర్యము. ఈమెకు నాపై నిచ్ఛయుండుటచేతనే నన్ను దమ యాశ్రమంబునకు రమ్మని యాహ్వానించుచున్నది. (ప్రకాశముగా)

అనుబంధము. (16)

చ. వనితరో పూజకేమి! పెఱ వాడనె, యట్లొనరింప; నేటికిఁ
ఘనశశినేలు నీనగు మొగంబునుగాంచితి మోదమబ్బె; నా
జననము ధన్యతంబొరసె సత్యముచెప్పెద లోకమందునా
కెనయగు ధన్యుఁడెందువన జేకుఁడలేదుసు మీతలంపుఁగన్.

నాకు వేఱే పూజలు కావలయునా? సుధంజిలుకు నీవాక్యము లేచాలు.

అహ—నీకుఁదాపసులన్న భక్తికదా. అందుచే మాయెడల గౌరవమున నట్లు బలికెదవు.

తే. గీ. అమరపతివైన నీవు మా కతిథివగుచు
నుండుమీనేడు మాయింట నొప్పమీఱ
నీదుపదవికిఁ దగినట్లు మోదమలర
జేయలేకున్న, నెట్టులో చేయఁగలము.

ఇంద్రు—నీయధీనమున నున్నప్పుడు నీవెట్లు జేసినను సంతసమే. నీకరుణఁ గోరియేకదా యిట్లువచ్చితిని.

మ. ఘనునింజూడఁగగోరుచాతక, మినుఁగాంక్షించు జక్రంబుజం
ద్రునిఁజూడంగఁ జకోరియుందలచు సంతోషంబుతోనెప్పుడున్

నినునామానసపక్షిచూడఁ దలచుఁ గ నీవెట్లుభావింతువో
వనితాకోమలపద్మపత్రినయనా పక్వేందుబింబాననా.

అహ.—(తనలో) ఈతని పలుకుల యందలి యర్థమునాకు దెలియుట లేదు. (ప్రకాశముగా) చింతామణి, కామధేనువు, కల్పవృక్షమిత్యాది మహాసంపదలెల్లఁ దులఁదూగు మహేంద్రునకు మావంటి మునిపత్నులఁ జూచినందువలన నేమిప్రయోజనము కలదు?

ఇంద్రు.—రమణీ! నీవట్లు తలంచెదవుగాని నేనట్లు దలంచెదనా? త్రిజగన్మోహనమైన నీసౌందర్యము చాలదా?

అహ.—(తనలో) ఓహో! ఈతఁడిట్లు బలుకుచుండెనేమి చెప్పుమా!

ఇంద్రు.—నారీమణీ! నిన్నుఁజూచిన నాకెంతయు విచార మగుచున్నది.

ఉ. కోమలి! యిట్టిభంగిబడు గుంజడదారినిగూడి యెట్టులు
ద్దామమృగోరగాదియుత ధారుణిఁబత్రిఫలోపహారదీ
క్షామతినుంటి వీవకట సర్వధరాతలభూరిరాజ్యల
క్ష్మమహనీయుఁ జేకొనిన నెందుకు వేయిటువంటి దైన్యముల్.

అహ.—మహేంద్రా! ఈశరీర మెవ్వరికి సేవజేయుటకై సృష్టింపఁబడినదో వారినే జేరునుగదా! దీనికై విచారమేల?

ఇంద్రు.—ఇవ్విషయమున నీజనకుఁడగు బ్రహ్మయెంతయు నవివేకియై వర్తించినాడు.

తే. గీ. దొండపండునుదెచ్చి సందోషమెసఁగ
కాకిముక్కునకును గట్టు కరణినిన్ను
గౌతమునకిచ్చెనీతండ్రి గాకయున్న
నతడునీదుసుందరతకుఁ దగినవాడె.

అహ.—అమరశ్రేష్ఠుఁడవగు నీతో నేను ప్రతిభాషింపరాదుగాని, మునీంద్రుల మహిమ యెఱుంగుటకు సామాన్యులు శక్తులుగారు

మదీయపురాకృత పుణ్యవశముననే గౌతముండు నాకుఁ బతియైనాఁడు.

ఇంద్రు—(తనలో) నాపలుకులొకదారిగను నీమె పలుకులొకదారిగను నున్నవి. (ఆలోచించి) కాదు కాదు. స్త్రీహృదయ మగమ్యము. పురుషులు తమ వలపును బయలు పెట్టినంత త్వరితముగా స్త్రీలు బయలుపెట్టరు. (ప్రకాశముగా) కురంగాక్షీ! మునీంద్రులు ప్రభావము గలవారే. కాని నీసౌందర్యమునకు గాక తాపసిసతివైయుండుట తగదని నాయభిప్రాయము.

అహ—(తనలో) ఈతని హృదయమది యొకవిధముననున్నట్లు తోచుచున్నది. (ప్రకాశముగా) మహేంద్రా! ఇప్పుడీ యనవసర ప్రసంగమేల?

చ. గళమునఁ దాలిబొట్టులలిఁ గట్టినయంతఁడు వానియైననుం
లలితకళావిలాసుఁడయి నన్ మతిగ్రుడ్డియైననుం
దులువయునైన, వాఁడె, నవ తోయజనేత్రికి దైవతుల్యుఁడై
విలసిలుఁగాదె యయ్యది వివేకివి నీకు నెఱుంగకున్నదే.

ఇంద్రు—(తనలో) ఈమె నాయభిప్రాయము నొక్కింతయు గ్రహింపక మాటలాడుచున్నది. నేను విఫలమనోరథుండనగుదునా యేమి? ఇంతటితో నేను నిరాసవహింపనేల? ఎట్లయినను నేనీమెంగూడుటకేకదా వచ్చితిని. కానిమ్ము నామనోభీష్టము నెమ్మదిగా బయలు పెట్టెదఁగాక!

అహ—(తనలో) ఈతనితో మాటలాడుచు నిక్కడ నేను తడయనేల. ఆశ్రమమున కరిగెదఁగాక.

(పోబోవును)

ఇంద్రు—(తనలో) ఓహో! ఈమెయరుగఁ దలంచుచున్నది. (ప్రకాశముగా)

మ. తరుణీ ! దూరపథ శ్రమాగతుఁడనై దాక్షిణ్యమే పారఁగా
బరికింపందలపోయకుండుటది భాగ్యంబౌనె నిద్దివ్యస
త్కరుణావాహినిఁ దానమాడుటకుఁగా దావచ్చియున్నాఁడ; సుం
దరి నీచిత్తమునాకు భాగ్యముఁ కవా దంబేలకావింపఁగన్.

అనుబంధము. (17)

నారీరత్నమా ! ఇంకనా నిశ్చయాభిప్రాయ మెఱింగించెద వినుము. భవదీయ దివ్యసౌందర్యము నాచిత్తమును నాక్రమించుటం జేసి, యవ్విరించి నిన్నిచ్చుటకుఁ గావించిన శపథంబును గెలుచుటకుఁ బ్రయత్నించితినిగాని, కృతకృత్యుండఁగా లేకపోయితిని. ఇయ్యది నాదురదృష్టమే యని భావించుచు, నాటినుండియు, నీపైననే చిత్తమునిలిపి, యెప్పుడైన నిన్నుఁగలిసికొని, నాయభీష్ట మెఱింగించితినేని దప్పక తీర్చెదవను యాశతో నుంటిని. జగన్మోహనమైన నీవిగ్రహమును మరల నేటికిఁ జూడఁగంటిని.

అహ—(తనలో) ఈతని యుద్దేశమిప్పుడు సంపూర్తిగఁ దెలిసినది. అక్కటా ! అమరలోక సార్వభౌముఁడగు నీతఁడెట్టి యకార్యమును జేయఁదలంచినాఁడు. ఇంకనితనికి నేను తగువిధమున నెమ్మదిగాఁజెప్పి చిత్తమునట్టి యధర్మోద్యోగమునుండి తప్పించెదఁగాక. (ప్రకాశముగా) పురందరా ! నీవెంత వెఱ్ఱివాడవయితివి. అమరలోకవిభుని చిత్తముగూడఁ గలంచునంతటి సౌందర్యముగలదాననానేను ? ఇయ్యది నాపాపముకాబోలు.

ఇంద్రు—(తనలో) భళిరా ! ఈమె వాక్చాతుర్యమున కెంతయు మెచ్చవచ్చును. (ప్రకాశముగా)

తే. గీ. మూఁడులోకంబులందున ముగ్ధలందు
నేనె సౌందర్యవతినంచు నింపుమీఱ

జెప్పుటకు మాటలుగానిట్లు । జెప్పితవుర !
తరుణీమదమయ్యె నీచము ? తార్కరమునకున్.

పల్లవాధరీ ! మూడులోకములయందే కాదు, పదునాలుగులోకముల యందును నీకెనయగు సౌందర్యవతి లేదు. అట్టి నీసౌందర్యమే కదా, యమరనాధుఁడనగు నన్ను దాసునిగాఁ జేసినది.

అహ — చాలు. చాలు. పాకశాసనా !

అనుబంధము. (18)

మ. క్షితిలోలేరెరసతీమణుల్ నవవయ । శ్శ్రీరూపలావణ్య జృం
భితలీవృక్ వరియింపఁగోరినను గూ । ర్మిక్ గందమూలాశన
వ్రితనై నారలుగట్టి తాపసకు వీ । రక్షోణీభంగి సం
తతముఁస్ వర్తిలుచున్న నన్నుఁ దలపక్ । ధర్మాబెకే వేశ్వరా.

మ. సతతంబున్ విబుధుల్ భజింపఁగ మహా । సామ్రాజ్యలక్ష్మీధురీ
ణతఁ బెంపొందిన దేవభర్తవయి వ । న్యగాత్రిసదీక్షాకృశీ
కృతగాత్రిన్ వరమౌనిపత్నిని నను౯ । గీర్తింపఁ బాయ నీ
గతిఁ గామించుతువె ధర్మమౌనె? యిదిలో । కంబెల్ల హర్షించునే.

ఇంద్రు — (తనలో) ఓహో ! ఈమెమాటల వలన నాకోరిక యీ
డేరుననియే తోఁచుచున్నది. (ప్రకాశముగా)

మ. గురువుల్ దిట్టగనిమ్ము ప్రాణసఖు లుల్ । గోపింపఁగానిమ్ము; నా
వరనారీమణిగుందనిమ్ము మర సా । భాగ్యంబున౯ వీడి యిం
కారునిం జేరగనిమ్ము, నాహృదయమున్ । దౌర్కృతయుస్ భీతిగాం
చ; రహి౯ నీవుకృప౯ ననుంగనినచో । శాతోదరీసుందరీ.

(ఇంచుక సమీపించి)

ఉ. బాలసమీరచైత్రిలిరు । పార్శ్వములన్ భజియింపఁగేకి హాం
పాళిపికధ్వజన్య విర । ఘాగ్భటిపాటిలనాత్మకార్ముక

జ్వాలతిక్త శితాస్త్రనివ హంబును సంధిల జేసె మన్మథుం
డోలలనామణీ యికను నా హృదిగాఁగిటఁ జేర్చి బ్రోవుమా.

(సమీపించును)

అహ—(దూరముగాఁబోయి తనలో) ఈతఁడు మితిమీఱి సంభాషించుచున్నాఁడు, నేనొక్కింత గట్టిగ జెప్పవలెను. (ప్రకాశముగా) మహేంద్రా! నీవమరలోకనాథుఁడవు. సమస్తధర్మముల నెఱింగినవాఁడవు. ఒకరికి బుద్ధిఁజెప్పఁ దగిననీవే యిట్టి యధర్మకార్యాచరణోద్యోగమునఁ బ్రవేశించిన నేమనుదును? పరకాంతలఁ గోరుట పాపంబని యెఱుంగవా? అవివేకమునఁ జేసి యట్లనుడివితివి. నీవట్టి యాశ నాపై విడిచివచ్చినదారిం బొమ్ము. ఇట్టియకార్యములందుఁ బ్రవేశించుచు దుష్కీర్తిపాలుగావలదు.

ఇంద్రు—రమణీశిరోమణీ! ఇట్టి సరససంభాషణచే నేలకాలయాపనము సేయుదువు.

తే. గీ. అతివరో నామచిత్తంబు నరయఁగోరి
పలుకఁగానేల నీకు నీ భంగి వినుము
వలపుగలుగుటచేఁగాదె వచ్చినాఁడ
జాగుసేయంగఁ దగదింక సరగరమ్ము.

(సమీపించును.)

అనుబంధము (19)

అహ—(ఇంచుక కోపమున) త్రుళ్ళిమించి రాగమున బడినది. పరవనితల నిట్లు గోరుకేనా అమరలోక సామ్రాజ్యను బ్రహ్మనీ పాలు జేసినాఁడు? ఇది యధర్మమని నీకుఁ దెలియదా? నీవు నాకలోక సార్వభౌముండవని యింతవఱకును గౌరవభావమున

హించి మాటలాడితివి. నీవు సంభాషణకుఁగూడ ననర్హుండవు.

ఇంద్రు—ఇంతీ! నీవట్లు బలికిన నేనేమనఁ గలవాఁడను.

మ. తరుణీ దేవసమూహమంతయు సను ద్యద్భక్తి సేవింపఁగా
వరనాకంబును నేలు దేవపతి యీ భంగిన్ మహాదీనుడై
కరుణం జూడఁగ నొక్క కాంత నడుగం గా నిట్లు వాక్రుచ్చునే
సిరిరాగాలును నొప్పువారుకలశే శీతాంశుబింబాననా.

అహ—(కోపముతో) నీవెంత సేయుదువు. నీదేవపదవి యెంత సేయును. నన్నెవ్వతెగాఁ దలంచితివో.

అనుబంధము (20)

ఇంద్రు—తరుణీ! నేను నీకు దాసుడనే యని వచించితినిగదా!

అహ—ఇంకనైనను నీవు బుద్ధిని మఱలించుకొని పొమ్ము. అమరలోక సామ్రాజ్యము మఱికొన్ని దినములఁ బాలించుచు సౌఖ్యము లందఁదలచినవాఁడవేని యిట్టి దుష్కృత్యముల సేయఁ దలంపకుము.

ఇంద్రు—సుదతీ! నీతోఁ జెల్మి నాకు దేవపదవికంటె నెక్కువ యని నమ్ముము.

అనుబంధము (21)

అహ—ఇంకను నీవట్టి సంభాషణ మానవుగదా! నే నీసంగతి విపుల జపతపోగరిష్ఠుండగు మన్నాథున కెఱింగించితినేని, నిన్నును, దేవలోకమునుగూడ నిమిషములో భస్మము సేయును. నీతో నింక సంభాషింపరాదు. పొమ్ము.

(నిష్క్రమించును.)

ఇంద్రు—అయ్యో! రమణీ! నీకై యింత శ్రమపడిన నామనోరథ మీడేర్పకుండఁ బోవుట న్యాయమా. (ఇంచుకయూరకుండి) అక్కటా! నే నీయువిదం గూడక యెట్లు దాళువాఁడ (ఆలో

చించి) త్రిభువనాధీశ్వరుఁడగు నేనొనర్చిన ప్రయత్నంబు విఫలంబగునా? అట్లు గాకూడదు. నే నీప్రాంతమునందే యుండి యేమాయోపాయముచేతనైన నాయభీష్టమును దీర్చుకొందుఁ గాక !

(ఇంచుక నడచుచున్నాఁడు.)

[మణికంధరుఁడు:—ప్రవేశించును.]

మణి—(తనలో) అబ్బబ్బా ! ఏమిఎండ ! తొమ్మిదిగంటలకే యింత తీక్ష్ణముగ నున్నది. ఈసూర్యుడు నదురు బెదురు లేకుండఁ దన చండకిరణముల నాపైఁ బ్రసరింపఁజేయుచున్నాడు. ఇంద్రుని వ్యాపారముకాదు కాని, మధ్య నానెత్తిమీదకు వచ్చినది. గుడిలోని లింగము మ్రింగిన పూజారివలె నుండినట్లే యుండి యింద్రుఁ డెక్కడకో దేగవలె నెగిరిపోయినాఁడు. ఆత నిజాడ నరయుటకు శచీదేవి నన్ను నియమించినది. ఈతఁడు నాకిప్పు డెక్కడ దొరుకును. (ఆలోచించి) ఆతడహల్యావిషయమున గట్టి పట్టు బట్టినాడు. ఒకవేళ యీయాశ్రమప్రాంతముననే దొంగ వేషముతో డనో తిరుగుచుండును. (నడచుచు) అబ్బా ! ముల్లు కాలులో గ్రుచ్చుకొనినది. ఓమహేంద్రుడా ! నీమూలమున నాకెంత యవస్థ వచ్చినదయ్యా ! నీవెక్కడ నుంటివయ్యా ! ఈముల్లు నన్నొక్కయడుగైన నవతలకు బెట్టనీయకున్నది. ఓ యింద్రుఁడా ! యింద్రుఁడా ! నీవు కనఁబడినచో, నాభార్య యొప్పుకొన్నచో గ్రామదేవతకు బదికొబ్బరికాయలు కొట్టి పసువు కుంకుమ యిస్తాను. (కూర్చుండును.)

ఇంద్రు—ఎవ్వరివో కేకలు వినవచ్చుచున్నవి. అందునా నామము సంబోధించినట్లు వినవచ్చె. ఇచ్చట నన్నుఁ బిలుచు వారెవ్వరు? (ఇటునటుఁజూచి) ఓహో ! నామిత్రుఁడగు మణికంధరుఁడే,

ఈతఁ డిక్కడి కెట్లువచ్చెను ? నే నీప్రాంతమున నుందునని యెట్లు గ్రహించినాఁడో కదా ! (సమీపించి) మిత్రుఁడగు మణి కంధరుఁడా యేమి?

మణి—అమ్మయ్యా ! ఇంద్రుఁడవేనా నాయనా ! కంటబడినావా. చంపివేసితివి. నీకొఱకు కొండలు, గుట్టలు, మిట్టలు, పల్లములు, డొంకలు, పొదలు, రుప్పలు, తుప్పలు యేమి వెతకుచుంటినయ్యా ! కాళ్ళలో అన్నిముళ్లే. కదలలేకుండ నుంటిని.

ఇంద్రు—మిత్రమా ! నీవిచ్చటి కెట్లు వచ్చితివి?

మణి—ఎట్లు వచ్చితినా? నీభార్యపంపిన వచ్చితిని.

ఇంద్రు—నేనిచ్చట నుందునని నీ వెట్లు గ్రహించితివి?

మణి—నాకు దివ్యజ్ఞానమున్న సంగతి నీ వెఱుఁగవు కాబోలు. అది యట్లుంచుము. తల్లి పుట్టిల్లు సంగతి మేనమామయొద్ద నాదా పటీకము ! ఎక్కడ నాకలోకము. ఎక్కడ భూలోకము. అహల్యకొఱకేకదా యింతదూరము శ్రమపడివచ్చితివి. చాలు చాలు. ఇంక నేను నిన్నువిడువను. నీ వెక్కడఁ గనఁబడిన నక్కడనుండి, యెట్లున్న నట్లే వెంటనే దొంగను పట్టుకొని వచ్చు నట్లు తీసికొని రమ్మని నీభార్య యాజ్ఞాపించినది. పద. పద.

ఇంద్రు—(తనలో) నారాకకుఁ గారణము నాభార్య గ్రహించియుండును. కానిమ్ము. రోటఁ దలదూర్చి రోకటి పోటునకు వెఱవనేల ?

మణి—మిత్రమా ! ఇంతదూరము వచ్చినందుల కహల్యా సందర్శనమైనమైనదా?

ఇంద్రు—సఖుఁడా! సఖీవృతమైన యామెను యింతకుమున్నే వీక్షించితిని.

మణి— "కొంగైన దగిలిన కొంతవాసి తీఱునను సామెతయున్నది కదా ! ఇంతటితో" బురమున వచ్చునట్లేనా?

ఇందుప్రి—(తనలో) నాయుద్యమము నీతని కెఱింగింపకయుండి, నేటి కిచ్చటనే కాలము గడిపించి, రాత్రి యహల్యావిషయమై మాయుఁదున్నదఁగాక ! (ప్రకాశముగా) మిత్రినూ! మార్గాయాసమున నీవు మిక్కిలి డస్సియుంటివి. నేటి కీవనమున మనము విశ్రమించి రేపరుగుదము. రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





# అహల్యా శాపవిమోచనము.

## తృతీయాంకము.

రంగము:—[గౌతమాశ్రమ సమీపమున ఇంద్రుఁడు, గౌతముని వేషముతో ప్రవేశము.]

ఇంద్రు—(తనలో) నేను ప్రయోగించిన, మాయయందు గౌతముఁడు చిక్కి, యాతఁ డిప్పు డాశ్రమము విడిచి స్నానార్థమై నది కరుగకుండునా? నేనిచ్చటనే వేచియుండి, యీతఁడరుగుట జూచి నేనాశ్రమమును బ్రవేశించెదఁగాక! గౌతమాకృతితోనున్న నన్నహల్య యావంతయు గుర్తింపజాలదు.

అనుబంధము (22)

తే. గీ. చిత్తమా! నీవు తొందరఁ జెందబోకు
గడియలోన నహల్యను గాంచఁగలవు
గాంచి నీకోర్కెఁ దీర్చుకో గలవు; ధన్య
వయ్యెదవు నేఁడు తప్పక యతివవలన.

(మన్మథుని నుద్దేశించి) కామదేవా? ఇన్నిదినములనుండియు నీమహేంద్రుని గీలుబొమ్మవలె నాడించితివి. కానిమ్ము. నీగర్వ మిప్పుడే యడఁగించెదను. (ఎదుటఁజూచి) అదిగో! ఆశ్రమద్వారము తీయఁబడుచున్నది. ఎందులకో! సరే నేనీచాటున నుండెద. (చాటునకేగి) అదుగో! గౌతమమునీంద్రుఁడు. ఈతఁడు నామాయంబడి స్నానార్థమై నదికే

యనుగుచుండనోపు. నేనొక్కింత కాలమూగి యాశ్రమమునఁ బ్రవేశించెదగాక. (ఇంచుక యూరకుండి) మహేంద్రుఁడు పట్టిన పట్టు విడుచువాఁడే. ఇంక నేనాలసింపనేల. నేనింటఁ జొచ్చెదఁగాక! గౌతముడు మరలి రాకపూర్వము నేను కృతకృత్యుండనై యరుగవలయును. (ఆశ్రమ ద్వారముఁ జేరి (ప్రకాశముగా) సతీ! సతీ!

[లోపలనుండి ఎవరువారు?]

ఇంద్రు—సతీ! ద్వారము దెఱువుము.

అహ—(తలుపుఁదీసి) నాథా! క్షమింపుము. ఎవరో యనుకొంటిని.

ఇంద్రు—(తనలో) నేడుగదా నా భాగ్యము ఫలించినది.

సీ. ఈదివ్యకాంత మ । హిత సుముఖావాప్తిఁ
దగు వానిమేలును । బొగడనగునె
యీవిద్రుమోష్ఠిని । నెదఁదగిలినవాని
పరమసౌఖ్యంబు జె । ప్పంగవశమె
యీకాంతతోఁ గూడి । యేకాంతమాడెడి
నరాత్ము పుణ్యంబు । దెలుపదరమె
ఈనాతితోఁ గూడి । యెప్పుడు చరియించు
పురుషుని భోగంబు । బొల్పఁదగునె

తే. గీ. యహహ, యీకంజనేత్రి నీ । యిందుముఖిని
నీజగన్మోహనసురూప । నెలమిఁగూడి
యభిమత సుఖాంబునిధి నోల । లాడనట్టి
వాని జన్మంబు వ్యర్థమై । బఱగుగాదె.

అహ—(ఇంద్రునిఁజూచి) నాథా! నది కరుగక తిరిగ వచ్చితివేల?

ఇంద్రు—(తనలో) ఈమె నన్ను గుర్తింపఁజాలదు. (ప్రకాశముగా) ప్రొద్దు తెలియక బయలు దేరితిని. కాని, యనుదినము నేను స్నానార్థమై యరుగు వేళ కాలేదు. ఇది యర్ధరాత్రము.

తే. గీ. వేళగాని వేళయిది యో ప్రియ విద్రుమోష్ఠి
భావజుండదియేమొ నా పైన విరిశ
రాళివిడుచుచునుండెను; గాన ప్రమదనన్ను
ధన్యుఁజేయు నీవును దలఁపుమిపుడు.

విజితేంద్రియుఁడనైన నాకీవేళగాని వేళ బుద్ధిపుట్టినందుకు నాశ్చర్యమగుచున్నది.

అహ—(తనలో) సాధుండెన్నఁడును నిట్లభిలషించినవాఁడు కాఁడు. నాకు మిగుల వింతయగుచున్నది. ధర్మమైననువధర్మమైనను బతియభీష్టము దీర్చుటయే పడతికి బరమశ్రేయస్కరము. (ప్రకాశముగా) నాథా! నీకోరిక దీర్చుటకన్న నాకుఁ బుణ్యమేమి కలదు? నీకృపచే నేను కృతార్థురాలనగుదును.

ఇంద్రు—రమణీ! నీపతిభక్తికెంతయు సంతసించితిని. (కౌఁగలించుకొని తనలో) ఈయాలింగన సౌఖ్యము నన్ను దేహమును మఱపించుచున్నది. (ఇంచుకయూరకుండి) నేనాలసించితినేని మోసము సంభవించును. (ప్రకాశముగా) రమణీ! కాలహరణమునకుఁ దావులేదు. రమ్ము (అహల్యతో నిష్క్రమించును)



రంగము:—[మార్గమధ్యమున మణికంధరుఁడు నిద్రించుచుండును గౌతముఁడు ప్రవేశించును.]

గౌత—(తనలో) అక్కటా! కుక్కుటరవంబాలించి తెల్లవాఱవచ్చుచున్నదని తలంచి బయలుదేరితిని. వేగుచుక్కయే పొడువలేదు. నిద్రాసమయమున నాకు వినవచ్చిన కోడికూఁతయే నన్నిట్లు మోసపుచ్చినది. ఇదియర్ధనిశీథసమయము. ఇప్పుడు స్నానమునకరుగుట యనుచితము. (ఇంచుకనడువగా మణికంధరునకుఁ బాదములు తగులును.)

మణి—(తొందరగాలేచి) ఓయిమునీంద్రా! లేవయ్యా! యేదోమృగ ముకాళోలు వచ్చి నన్ను తొక్కినది. ఈ యరణ్యములో నిన్ను వెదకుటకు నేనేల వచ్చితిని? (గౌతముని జూచి) ఓయి బాబూ! ఇదియేదో జడలబ్రహ్మవలె నున్నది నన్ను దీనివాతఁ బడఁ వేయకువయ్యా! మహామునీంద్రా! లెమ్ము లెమ్ము. (పరిక్కించి జూచి) ఏడీ! ఈమునీంద్రుడు! నన్ను నట్టడవిలో నొంటిగా విడిచి యెక్కడికి బోయితివయ్యా!

గౌత—(లోనలో) ఈతఁడెవ్వఁడు? ఈయరణ్యమున నొంటిగా నిట్లు బరుగిడనేల? (ప్రకాశముగా) ఓయీ! నీవెవ్వరవు? భయమందవలదు.

మణి—(భయమునటించుచు) నాయనా! నీవు మనిషివేనా! నన్ను మ్రింగవచ్చిన క్రూరజంతువు కావుగదా! నాకాళ్ళళ్ళోవంది వణుకు పుట్టుచున్నది.

గౌత—వెఱ్ఱివాడా! భయమందవలదు. నేను గౌతముండను జటిలుండను.

మణి—ఏమో! నీవు జటిలుండవో కుటిలుండవో! నాకింకను భయము తీరలేదు. ఈరూపములోనున్న ఘాతుకమృగము కావుగదా! వెనుక హిరణ్యకశిపుని సంహరించుటకొఱకు విష్ణుమూర్తి నరసింహావతార మెత్తినట్లు నన్ను జంపుటకై నీవీ మానవజడల బ్రహ్మవేషము వేయలేదుకదా. చెప్పుము. నాభార్యను నమ్ముకొని నేను, నన్ను నమ్ముకొని నాభార్యయు నున్నాము. ఇంతవఱకు సంతానము కలుగలేదు. గోత్రమునిలుచు మార్గము జూడని దే నీవు నన్ను గుటుక్కున మ్రింగితివా, మాయింటి యజమానురాలు యమలోకమునకైన వచ్చి నన్ను, పీపుచిట్లునట్లు వేయగలదు. కావున నన్ను రక్షింపుము.

గౌత—(తనలో) ఈతఁడొక పరిహాసవాక్యప్రియునివలె నున్నాఁడు. ఈతఁడింద్రునిఁ బిలుచుచున్నాఁడు ఈ సంగతి నరయవలయును. (ప్రకాశముగా) నీవింద్రునిఁ బేర్కొనుచున్నావు. ఆతఁడుగూడ నిచ్చోడ కరుదెంచెనాయేమి?

మణి—(తనలో) నాసఖుండగు మహేంద్రుఁడే కాంతకై నానావస్థలఁ బడుచుండెనో, యట్టి యహల్యకీతఁడు భర్త. ఇంద్రునిరాక నెఱింగించితి నేని నేమిహానికలుగునో. ఇట్లు బొంకెదగాక. (ప్రకాశముగా) నిద్రకన్నులలో లేచి భయముంది నేనేమిపలికితినో, యెవ్వరినిఁ బిలిచితినో, నాకేమి తెలియదు

గౌత—నీపలుకులు చిత్రముగనున్నవి. పోనిమ్ము మహేంద్రునినీవెఱుంగుదువా?

మణి—ఒక్క మహేంద్రునే యెఱుఁగనేల? పదునాల్గు లోకములలో నున్నవారందఱను నెఱుగుదును?

గౌత—ఆతఁడుగూడ నీవెంట వచ్చినట్టు నీకేకలవలన నెఱింగి యడిగితిని.

మణి—వస్తే రావచ్చు. రాకపోతే రాకపోవచ్చు. మూడులోకములేలు మహేంద్రునితో నొకరి యాజ్ఞతో బనిలేదుకదా. అనవసరమైన మాటలకు జవాబు నీయవలదని మా గురువులవారు నాకుఁజెప్పియున్నారు. ఇంక నేను నీతో మాటలాడఁజాలను.

గౌత—(తనలో) ఈతఁడెవ్వరో సరియైన సంగతియే తెలుపకయున్నాఁడు. ఈతని మాటలవలన మహేంద్రుఁడిచ్చోడ కరుదెంచినట్లు తోఁచుచున్నది. ఈసమయమున నాతఁడిచ్చటికేల యరుదెంచి యుండును. ఈ యింద్రుఁడు నాభార్యయగు నహల్యం గూర్చి, వివాహంబుగాక పూర్వము విరించి చేసిన శపథంబు నగెల్చి యామెను పాణిగ్రహణ మాడఁదలంచి, విఫలప్రయ-

త్పుఁడయ్యెను. ఆకారణంబున నహల్యా విషయమై యీతఁడే
మైన దురభిప్రాయము బూనివచ్చెనేమో! (ఆలోచించి) మహేం
ద్రుఁడు దుష్పథమున వర్తించునా? (ఇంచుకయూరకుండి)
ఏమేమో నామనంబున నెక్కొంత యనుమానము వొడము
చున్నది. నేనాశ్రమమునకే మరలెదగాక. (నడుచుచున్నాఁడు)

మణి—(తనలో) ఈయింద్రుఁడర్ధరాత్రి సమయమున నన్నిచ్చట నొం
టరిగడించి యెచ్చట కరిగినోకదా! ఏమాయోపాయముననైన
నహల్యను వంచింపనేగియుండెనా. (ఆలోచించి) నాచిత్తము
నకల్లో లోఁచుచున్నది. ఆహా! జారునిచర్యలతి విచిత్రముగ
నుండునుగదా!

సీ. తనచిత్తమూవంత । తరుణి, యెఱుగకుండఁ
దీయమాటల నెన్ను । తెల్పుచుండు
తానువలచు కాంత । యేనాటికి లభించు
నాయని విరతముఁ । దలఁచుచుండు
నేతెఱంగుననైన । నాతినిఁగూడంగ
బహుమాయలొడ్డుచు । బఱగుచుండు
నిరతంబు వెనువెంటఁ । జరియించుప్రాణ స
ఖునిగూడ వంచించి । దనరుచుండు

తే. గీ. గోడలనుదాటి; నెత్తైన । కొండలెక్కి
కాననప్రదేశంబులఁ । గడచు; నదుల
దాటు, కష్టముల్ కొనగోట । మీటి; భళిర!
పరసతులఁగోరు జారుండు । ధరణియందు.

ఈయింద్రుఁడేదియో మాయంబన్నదలఁచియే గౌతమాశ్రమమున
కేగియుండును. దీనివలన నాతనికెట్టి హాని సంభవించునోయని డెంద
మున సందియము గలుగుచున్నది. కానిమ్ము. నేనతనిరాకకై యచ్చట
వేచియుండును. (నిష్క్రమించును.)

గౌత — ప్రొద్దు దెలియక బయలు దేరితిని. (నడచి) ఇదిగో! ఆశ్రమ మునమీపించితిని. నాచిత్తమున నేమికారణమోగాని యది యొక విధమయిన దడ జనించుచున్నది. చిత్తము శంకాసంకులమై యున్నది. (ఎదుట(జూచి) అదిగో! ఆశ్రమమునుండి యెవరో వచ్చుచున్నారు. (పరికించి) ఎవరో! యనుకొంటిని? మహేంద్రుఁడే! ఔరా! ఇతఁడెట్టి దుష్కృత్యమొనర్చినాఁడు.

[ఇంద్రుఁడు ప్రవేశించును.]

ఇంద్రు — (తనలో) కార్యసిద్ధిబొందిన నేను గౌతముడు రాకపూర్వమే యాశ్రమము విడిచిపోదలంచితిని. విధికృతమున నాలస్యమైనది అదుగో గౌతముఁడు. ఈతఁడు స్నానమున కరుగకుండ నే వెనుక మరలివచ్చినాఁడు. అక్కటా! ఇప్పుడేమిసేయుదును?

తే. గీ. ఏనొనర్చిన పనిదూష్యమైనదికద
యితఁడుతాపసోత్తముఁడు నాకెట్టిశాప
మిచ్చునో యంచకున్నది యేమిసేతు
ధాతకృతమును దప్పింపఁ దరమెయకట.

గౌత — (కోపముతో నింద్రునిఁజూచి) ఓయీ! మహేంద్రా! నియమరలోక సామ్రాజ్యపరిపాలన మీవిధముగఁ బరిణమించినదా!

చ. తెలతెలవారవచ్చెనని తెల్పగనన్నును; కోడినాచుమేల్కొలిపితివే? మదీయసతిఁ గూడఁగ దుర్మద! చిత్త! నిన్ను నుర్జలజభవుండు దేవపురనాథునిగానొనరించియుంట, యుందులకేయటంచు నెంచితి వె? దోషముగానిదియెంచకుంటివే.

ఇన్ని దినంబుల నుండియు, నీవు మహాపూజ్య చరిత్రుఁడవని నిన్ను గౌరవభావంబునఁ జూచుచుంటిని గాని యిట్టి దుష్కృత్యముల సల్పువాఁడవని యెఱుంగనైతిని.

అనుబంధము (23)

తే. గీ. కన్ను గానక నీవధో గతినిఁబొంద
జేసి తేయిట్టుగల్గునే చిత్తవనము
లాసుఘన జపతపముల నాచరించు
తపసులేయు సేయుకురందు దలచితేమొ.

ముని పుంగవుల తపోమహిమమైన యెఱుఁగక పోయితివా? ఓరీ! నేడు నిశ్చయముగా నలిగితి నేని, యమలోకముతో గూడ నీవు నిముషములో భస్మముగాక యుందువా ? కానిమ్ము. ఇట్టి యకార్య మాచరించినందు లకు ఫలంబనుభవించెదవుగాక! నీశరీరమంతయు నయనంబులఁ బోలు చిల్లులతో నిండి యుండుఁగాక!

ఇంద్రు—(తనలో) అక్కటా! ఈతపోనిధి నన్ను శాపతప్తునిఁ జేసినాఁడు. ఏవికృతరూపుఁడనై యందఱకును గానిపింతునుగదా! ఏమిచేయుదును? (మన్మథుని నుద్దేశించి)

తే. గీ. ఆయహల్యపైనాకు మోహంబుగొలిపి
మాయవేషంబు వేయించి మగువతోడ
గూడఁగాఁ జేసి నాకొంప గూల్చినావు
నీదుచర్యలు చిత్రంబు నిరజాస్త్ర.

(ఇందుకయూరకుండి) పరసతింగోరినందుకుఫలముగంటిని. నామిత్రుఁడు నాకై వేచియుండును. వానింగలిసికొని యరిగెదఁ గాక!

సీ. శాపతప్తుండనై సతిమోహము నేభంగి,
సిగ్గునువిడిచి వీక్షించువాఁడ
పడతికై పోవ, నీపాటుగలిగెనను,
వారితో నేటిఁ బలుకువాఁడ
యమరేంద్రుడిట్టి కార్యముఁజేసెననునింద,
నేమాడ్కిఁ దలఁదాల్చి మోసగువాఁడ

అనుదినంబును నన్ను నరయఁగ నరుదెంచు,
మునుల మోములనెటు గనెడివాఁడ
తే. గీ. వలదువలదంచు బదిసార్లు పలికినట్టి
హాస్యవాక్యప్రియుండైన యాప్తసఖుని
జేరి; మోమెత్తియెట్లు భాషించువాఁడ
నేమి సేయుదునింక నెందేఁగువాఁడ.

నేనాచాటుననుండి యహల్యవిషయమే మేమిజరుగునో చూచియుండెదగాక.- (నిష్క్ర)

అహ—(ప్రవేశించి) తనలో ఆహా! ఆయింద్రుఁడు నన్నెంతమోసము జేసినాఁడు. నేనావంతయు నాతనిమాయను గుర్తింపలేకపోయితిని. నేనిప్పుడేమిచేయుదును? నాథునిక్షమింప వేఁడుకొందుగాక. (గౌతముని పాదములపైఁ బడి) నాథా! మోసపోయి యిట్టియకార్య మాచరించిన నన్ను రక్షింపుము,

గౌత—(కోపముతో) ఓసీ! పాపీ! నీవెట్టికార్య మొనర్చితివి? బ్రహ్మపుత్రివనియు, సుగుణపేటివనియుఁ దలంచి నిన్నుఁ బరిణయ మాడితినిగాని యిట్టిదుష్ట చరిత్రవగుదువని యెన్నఁడును గలనైనఁ దలపనైతిని. నీవిన్నిదినంబులనుండియు నన్ను వంచనబుద్ధిఁ సేవించుచుంటివని యెఱుంగకపోయితిని. జారిణీ! మునీంద్రులముందు నన్నుఁదలయెత్తుకొని మెలంగకుండునట్లు జేసితివికదా! ఛీ! నీముఖంబుఁజూచినఁ బంచమహాపాతకములుసంభవించును.

అహ—(ఏడ్చుచు) ప్రాణేశ్వరా! నేను దుష్టస్వభావముగలదానను గాను. నాపూర్వకృతప్రారబ్ధముననే నాదురాత్ముండగు నింద్రుని వలన వంచింపబడితిని. నీరూపమును ధరించియాతఁడువచ్చుటం జేసి నేను మోసపోయితిని. ఇంతకంటె నీపాదసాక్షిగ నన్యమేమియు నెఱుంగను. నన్నురక్షించినను శిక్షించినను భారము నీయది.

అనుబంధము. (24)

గౌత—

శా. భాషానాథుని పుత్రివై యిటులు నీ । ధ్యానంబు నుంబూని నీ
వీవుత్తేనియు నంకఁబొందకయె దే । వేమఱిఁ మదంబారఁగా
యోషాకూడిన కారణంబునను నీ । యుర్వీజనుల్ నవ్వఁగా
పాషాణాకృతిఁ దాల్చియుండుము వనిన్ । బల్మాఱటలింకేటికిన్.

నారీ! నీవిట్టి యకార్యము జేసినందులకిచ్చటఁ బాషాణమై పడియుండుముగాక!

అహల్య—ఆర్యా! నాథా!

తే. గీ. చేసితిని యపరాధంబు । జిత్తమునను
దెలియకక్కటా యీరీతి । నలిగి ఘోర
శాపమొసఁగినాడవు నాకు । సదయహృదయ
మెట్లు భరియించు దాన జీ । వేశ దీని.

ఈయపరాధము నేను తెలిసి చేసినది కాదు. నీపాదసేవకు దూరమై యెన్నాళ్లు వనమున పాషాణమై యుండవలయును. నాయందు దయాంతరంగుండవై త్వరలో శాపవిముక్తినంది నీపదదాస్యము జేసికొనునట్లనుగ్రహింపుము.

గౌత—(తనలో) ఈమె యీదోషమును నిశ్చయముగా నెఱింగి జేసినదికాదు. ఆసంపదాంధుండగు మహేంద్రుఁడీమెను వంచించినాఁడు. ఒకవిధమున నీమెకు శాపవిముక్తిఁ గలుగఁజేసెదగాక (ప్రకాశముగా)

మ. ఘనుఁడిక్ష్వాకుకుల ప్రసూతుఁడు రఘు । శ్రేష్ఠభర్త్రయాగాధినం
దనుతో నివ్వనికొచ్చి నప్డతని పా । దంబుల్ శిలన్ దాకినం
తనె నీశాపము వాయఁగల్గినను గాం । తా గూడఁగా జాలె దీ
వనుమానింపకు సర్వముఁ భగవదా । యత్తంబుయోచింపుమా.

అహ—హా! (శిలయగును)

గౌత—నేనుగూడ నీయాశ్రమమును విడిచి వేరొకస్థలమున కరిగెద గాక! (నిష్క్రమించును)



రంగము—(అరణ్యము:-ప్రవేశము. ఇంద్రుఁడు మణికంధరుఁడు)

మణి—మిత్రమా! మహేంద్రా! జరిగినదానికై యింక విచారించి నందువలనఁబ్రయోజనమేమియున్నది. ఇక్కడమనమింకను దడవు జేసినచో మరలగౌతముఁడువచ్చునేమో. త్వరగానడుగులు వేయుము. యింటికిఁ జేరుకొందము.

ఇంద్ర—సఖుఁడా! ఇట్టి యకార్యమువలదని నాకెంతయో తెలిపినను వినకవచ్చి, యీశాపమునందిన నేనిప్పుడు పురమున కరుదెంచి శచీముఖమెట్లుఁ జూడగలను. అమరలోకనాథుండగుమహేంద్రుఁడిట్టి యకార్యముఁ జేసెననునిందభరింపవలసివచ్చెనుగదా! నిరంతరము నాశ్రేయస్సు గోరి వచ్చుచుండు మునీంద్రులింక ముందు నన్నేవిధముగ భావింతురోకదా! అక్కటా! ఎట్టియకార్య మాచరించితిని? శాపమునకై వగవనుగాని నిందకు మాత్రము వగతును.

మణి—మహేంద్రా! ఈయాలోచనయంతయు ముందేయున్నచో నిట్లుసంభవించియుండదుకదా పరకాంతనుగూడుగూడుమనియూ దిక్కుమాలిన మన్మథుఁడుబట్టి పీడించునప్పుడు కాముకులకు ముందుచూపే కాని వెనుకచూపుండదు. ఎవ్వరుచెప్పెడి మాటలు చెవులకెక్కవు. మిత్రమా! ఇప్పుడేమనుకొన్న నేమిలాభము! సరేగాని యడుగుటమరచితిని. యహల్యవిషయములోఁగూడ గౌతముఁడెట్టిశాపమునైన నిచ్చెనా? లేక చూచీచూడనట్లూరకొన్నచో యదియే పోవునని సైరించెనా?

ఇంద్రు—ఆమెను పాషాణమగు నట్లు శపించినాఁడు.

మణి—సఖుఁడా! నీవే యదృష్టవంతుడవు, శరీరమునిండ నయనముల కేమి లేే; ఇంక మన మిక్కడనుండవలదు. మరలమనముగ'లేము నికంటఁబకుదుమేమో! ఇంకఁజింతింపక రమ్ము. విధికృతమును నెవ్వరును దాటఁజాలరు. కాని, నాకుమాత్రము నీవొకదానికి మాత్రమనుజ్ఞనీయవలెను.

ఇంద్రు—దేనికి, సఖుఁడా!

మణి—మరేమియును లేదు, కాని, యొక్కసారి సమస్తలోకముల దిరిగి, ఒకచిన్న విషయము ప్రజలకు చాటించవలయునని యుద్దేశమున్నది.

ఇంద్రు—ఏవిషయము.

మణి—ఏమివిషయమున్నది. పరకాంతాగమనమును గూర్చి.

ఇంద్రు—ఏమని,

మణి—ఏమున్నది? ఇట్లు జెప్పెద,

సీ. అగ్నిసాక్షిగఁగొన్న । యతివలింటనునుండ;
బరసతినాశించు । పాపులార
పరకాంతఁగన్నంత । మురియుచు వెనువెంటఁ
బరుగులెత్తెడిదుష్ట । చరితులార
దాఁటిఁబోయెదుపర । దారలనీక్షించి,
కన్నులఁ ద్రిప్పెదు । కుమ్మర్కులార
అన్యాంగనలఁబొంద । నర్ధనిశినయిన,
గోడలందాటెదు । కూళలార

తే. గీ. వలదుపరకాంత గమనంబు । వలదు వలదు
దానివలన ధనము నష్ట । మగును; గా'ర

వంబు నశియించు నిదిగాక । ప్రాణహాని
సంభవించును వేయేల । జారులార.

అని చెప్పెదను. (ఇంచుకయూరకుండి) ఈసంగతి తరువాతఁ జూచుకొందము. ప్రస్తుతము గృహమునకుఁ జేరుదము. నీవిషయమై చింతింపకుము దొంగతనము జేసి కారాగృహ శిక్షనంద, కొన్నాళ్ళకు దానినుండి విముక్తియైనవాడు తన గ్రామమును బ్రవేశించినప్పుడు రెండుమూడు దినములవఱకును గృహమువిడిచి యావలకువచ్చుటకు సిగ్గుపడుచుండును. తరువాత బ్రతుకును. అట్లే నీనింద నాలుగైదు దినములకుఁ బ్రాతపడును. రమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





# అహల్యాశాపవిమోచనము.



## చతుర్థాంకము.

—∞—

రంగము:—[సాకేతపురము—సభాభవనమున దశరథుఁడు, మంత్రియగు సుమంత్రుఁడు ప్రవేశము.]

దశ—మంత్రీ! సుమంత్రా! కుమారులస్త్రవిద్యాపరిపూర్ణులై యుండ నెప్పుడు వీక్షింతునో కదా! ఈవిషయమున నాకిఁక దగిన గురువుగా నేమహాత్ముని బ్రార్థించిన బాగుండును.

సుమం—ఈవిషయమున వసిష్ఠమునీంద్రునితో నెమ్మదిగా యోచించి, యమ్మహాత్ముని వచనంబుల ననుసరించి వర్తింతము.

దశ—అవును. ఆమహాత్ముఁడెఱుఁగని విషయమొక్కటియు లేదు.

సేవకుఁడు—(ప్రవేశించి. దశరథునిఁ జూచి) మహారాజా! దేవరవారి కొఱకు విశ్వామిత్రమునీంద్రుఁడరుదెంచినాఁడు.

దశ—బ్రహ్మసన్నిభుఁడగు నాతపోనిధి రాక కేమి యభ్యంతరముండును. (మంత్రినిఁ జూచి) సచివా! ఆతని కెదురేగి తోడ్కొని రావలయును. (సింహాసనమునుండి లేచి యీవలకు వచ్చును)

[విశ్వామిత్రుఁడు—ప్రవేశించును.]

దశ—(ఎదురేగి) మునీంద్రా! వందనములు.

విశ్వా—అఖిల శుభావాప్తిరస్తు.

దశ—మహర్షీశ్వరా! ఇటు దయచేసి యీ మణిమయ పీఠంబున నాసీనుఁడవగుము.

విశ్వా—(ఇంచుకనడచి. యాసీనుఁడై) దశరథా! నీవును నీయాసన
మధిష్ఠింపుము.

దశ—(ఆసీనుఁడై)

ఉ. పావనమయ్యె నాకులము । పండెఘనంబుగ నాతపంబు; మో
దావహమయ్యె మానసము । ధన్యచరిత్రుఁడవైననీవు, సు
శ్రీవిలసిల్ల వచ్చుటను । జేకుఱునింక శుభంబులెన్నొ; వా
ణీవరసన్నిభా! వరము । నిప్రకరోత్తమ గాధినందనా.

విశ్వా—

సీ. సౌఖ్యమేకదనీకు । జలజాప్తవంశాబ్ధి
రాకానిశాకరా । రాజచంద్ర
ఆనందమేకదా । నీనారులైన కౌ
సల్యాదిముఖ్యర । సాధ్వులకును
మంగళంబేకదా । మనువంశతిలకులై
నట్టినీపుత్రుల । నల్వురకును
భద్రమేకదరాష్ట్ర । ప్రజలకెల్లరకును
కుశలమేకద, యమా । త్యసమితికిని

తే. గీ. సస్యవృద్ధినిగాంచిరా । జ్యంబుసకల
సంపదలఁతోడ నొప్పునే । శత్రులనెడి
మాటలేకుండనుంటివే । మానవేంద్ర
వినఁదలంచితి చెప్పుమీ । వేడ్కమీఱ.

దశ—మునివర్యా! నీకటాక్షమున మేమందఱమును కుశలముగనే
యుంటిమి. (ఇంచుక యూరకుండి) మునిచంద్రా! నీతపము
నిర్విఘ్నముగ సాగుచున్నదా?

విశ్వా—ఏమిసాగుట!

దశ — మహాత్మా! అట్లుఁ జెప్పుచుంటివేమి? క్రూరరక్తచరుల బాధ యేమయినఁ గలుగుచుండెనా యేమి?

విశ్వా — రాజేంద్రా! దైత్యబాధయుండిన నుండుఁగాక! నీవంటి వారుఁ దలఁచుకొన్నచో నయ్యది సముద్రములో వాసిపోవును.

దశ — అట్లయిన, గాధేయా! నీవరుదెంచిన కార్యము నానతిమ్ము. ఎట్టిదైనను మౌళిందాల్చి నెఱవేర్చెదఁగాక!

విశ్వా — నాకార్యమెట్టిదైనను నెఱవేర్చెదనని నీవు వచించినప్పుడే నేను సఫలీకృత మనోరథుండనైతినని తలంచితిని. దశరథా!

తే. గీ. సప్తవాసరదీక్షతో సవనమొకటి
సేయుచుండఁగ రాక్షస శ్రేణివచ్చి
విఘ్నమొనరించుచుండిరి పృథ్వినాథ
దానికాపాడి వెలయుము దయనుఁబూని.

దశ — కౌశిక మునీంద్రా! నీవింతగా వేడవలయునా? ఆరక్కసు లెవ్వరు? వారెటనుండివచ్చుచుండిరి?

విశ్వా — వారు తాటకయను ఘోరరాక్షసికిఁ దనూభవులు. కామరూపులు. మారీచసుబాహులను నామంబులఁ దనరుచుండిరి. నృపాలా! వారు సేయుచున్న పనులంగూర్చి యేమని వచియింతును? యజ్ఞముసేయు సమయమున వారరుదెంచి సవన వేదికలపై రక్తముగుల్పించుచుండుటయేగాక, చెప్పరాని దుష్కార్యముల సలుపుచున్నారు.

దశ — అక్కటా! సృష్టికిఁబతిసృష్టిఁ గావించిన నీయజ్ఞమునకే వారు భంగమొనరించుచుండిరిగా! మునీంద్రా! ఇంక నంశయింపనేల.

తే. గీ. అమితసైన్యముతోడనే నటకువచ్చి
దనుజులందున్మి భవదీయ ఘనసుఖంబు

గాచి సకలమునీంద్రుల । కరుణ కేను
బాత్రుడనగుదు నమ్ముమీ । భవ్యచరిత.

మునిపుంగవా ! నీముఖముగాచుటకన్న నాకు వేఱొక పుణ్యమేమి యున్నది ?

విశ్వా—రాజా ! నీవు శౌర్యధనుండవనుట కావంతయు సంశయము లేదు. కాని, యొకరక్కసుఁడనిచేఁగూలువాఁడుగాఁడు. ఇక్కార్యమునకై నిన్ననవసరముగ శ్రమపెట్టుటకు నాచిత్తము సమ్మతింపదు.

దశ—అట్లయిన మహాత్మా ! ఆరక్కసు లెవ్వరిచేఁ గూలుదురు ? ఆవీరులు నాయధీనమున నుండిరేని వారిం దప్పక పంపెద.

విశ్వా—నరపాలా ! నీవలనఁగాని కార్యమైనచో నేనేలనిన్ను శ్రమపెట్టఁదలంతును ? ఆరాక్షసులంగూల్చి మదీయ సవనంబు బరిరక్షించుధీరులు నీయొద్దనే యున్నారు.

దశ—అట్లయిన సంశయమేల ? దేవా ! వారిందప్పక పంపెద. వారెవ్వరో పేర్కొనుము.

అనుబంధము. (25)

విశ్వా—

శా. ఆరక్షఃకులవీరులందునిమినా । యాగంబురక్షించు, నా
వీరశ్రేష్ఠుఁడెవండో తెల్పుమనుచున్ । బృథ్వీశవాంఛించెదీ
శ్రీరాముండు భవత్తనూజుఁడెలమిన్ । జెండాడియాదైత్యులన్
గారుణ్యంబునయజ్ఞమోమునవివ । కాఁగాంతుఁడక్కొమ్మగన్.

కావున నీవు డెందంబున మఱియొక విధమున సంశయమందక, శ్రీరామచంద్రుని లక్ష్మణ సమేతముగా మదీయ సవన రక్షణార్థమై నావెంటఁబంపుము.

దశ—(నవ్వుచు) మునీంద్రా ! నీవాక్యమునాకతివింత గొలుపుచున్నది.

తే. గీ. అకటపసికూనలైన వా ॥ రాహవమున
రక్కసుల నెట్టు లెదిరించి ॥ యుక్కడంచి
సవనరక్షణ సేతురు ॥ సంయమీంద్ర
వింతజనియించె నీపల్కు ॥ వినఁగనాకు.

అనుబంధము. (26)

నాకుమారులింత వఱకు ధనుర్విద్యనే యభ్యసించ లేదు. ఘోరాకారులును, క్రూరచిత్తులును, నగునా దానవులంజూచినచో బాలురగు మత్కుమారులు భీతిల్లక యుందురా? నోరెఱుఁగని పసిబాలురెక్కడ? నక్తంచరులగు మారీచసుబాహులను వధించుటెక్కడ? త్వదీయమఖసంరక్షణ మొనర్చు టెక్కడ!

విశ్వా—

ఉ. బాలకులెట్లుయాగమును ॥ బాలనసేయుదురంచు నెంచగా
బోలదు నీకుమారకులె ॥ పూర్ణ పరాక్రమ విక్రమంబులన్
నాలమునన్ నిశాటులను ॥ నంతకుపేటికిఁబంపి, యాగమున్
బాలనఁజేసి కీర్తిఁగొని ॥ భాసిలుటన్ గనెదీప్రభూవరా.

నీకుమారుల విషయమై నీవు భయమందనలదు. నాప్రాణములతో సమానముగాఁ గాచి తెచ్చి నీకు మరల నొప్పగించెద. సందియమందక శ్రీరామ లక్ష్మణుల నావెంటఁ బంపుము.

దశ—

తే. గీ. పరమసత్యను బూనితి ॥ పంపుఁజేసి
సత్కుమారులఁగాంచితి ॥ సంయమీంద్ర
యెన్నఁడును వారలను బాసి ॥ యెఱుఁగనెట్లు
బంపనోపుదు రక్షింపు ॥ పరమకృపను.

పుట్టినప్పటినుండియు నాతనయులను బాసి యెప్పుడును నుండ లేదు. అందులో శ్రీరాముఁడు నాప్రాణము. అతఁడే సర్వము. అతనింజూడని

దినము నాకొకదుర్దినము. మహాత్మా! రాముని(బాసి నేనొక్క నిమిష కాలమైనను నిలువఁజాలను. నాబ్రదుకంతయు రామునియాధారపడి యున్నది.

తే. గీ. వలయుసైన్యంబుతోనే నే వచ్చెదనుజ
వీరులరణంబుననునోర్చి వేడ్కమీఱ
మఖమురక్షించిమించెద మౌనిచంద్ర
తనయులనుబంపఁజాలను దయనుగనుము.

విశ్వా—ఈకార్యము నీవలన జరుగదనినే నింతకుమున్నే చెప్పియుంటి నిగదా! దశరథా! నీతనయులంగూర్చి సంశయింపవలదు. శ్రీరాముని సామాన్యునిగా దలంపవలదు. అతఁడు మదీయ యాగపరిపాలన కర్తయని నాకుఁ దెలియును.

దశ—మునిచంద్రా! నీవెంత చెప్పినను శ్రీరాముని బంపుటకు నాచిత్తము సమ్మతింపదు. నీపాదంబులకు నమస్కరించెదను. నాయందుఁగ్రుపాంతరంగుండవై మన్నింపుము. శ్రీరాముని మాత్రము బంపఁజాల.

విశ్వా—(కోపముతో) ఇక్ష్వాకు కులప్రసూతుఁడవగు నీవసత్యమాడుదువని నేనెన్నఁడును దలంపలేదు. ఔరా! మహీపాలా! తొలుత నెట్టికార్యమునైన సేయుదునని పలికి, యిప్పుడు శ్రీరాముని నావెంటఁ బంపుమని తెలిపినంతనే యిట్లు బలికెదవు గా! ఇట్టివాడవు మొదట నెట్టికార్యమునైన సేయుదునని యేల వాగ్దానమొసంగితివి? రఘుకులమున నసత్యవాగ్రతుఁడవగు నీవు నేటికి జనించితివి.

సుమం—(తనలో) ఈమునీంద్రుఁడాగ్రహమును బూనినాడు. ఏమి సేయునో కదా!

దశ—మహాత్మా! నీవిట్లాగ్రహించిన నేనిలువఁగలనా? రఘురాముని బాయఁజాలని వాడవగుటచే నట్లు వక్కాణించితిని గాని మఱి యొండుగాదు.

విశ్వా—(కోపముతో) నృపాలా! నీవిట్టివాడవని యెఱుంగక యరుదెంచి మోసపోయితిని.

[వసిష్ఠుఁడు—ప్రవేశించును.]

విశ్వా—(దశరథునిగాంచి) రాజా! నాకోరికంగూర్చి యావసిష్ఠునకుఁ దెలిపి యేమనునో చూడుము.

వసి—(తనలో) విశ్వామిత్రుఁ డెందులకో వచ్చియున్నాఁడు.

విశ్వా—(వసిష్ఠునిఁజూచి) వసిష్ఠా రమ్ము. సమయమునకే వచ్చితివి.

దశ—(వసిష్ఠునకు నమస్కరించి) గురువర్యా! ఈపీఠమున నాసీనుఁడ వగుము. (అందఱును నాసీనులగుదురు.)

వసి—గాధేయా! తపము నిర్విఘ్నముగ సాగుచున్నదా!

విశ్వా—వసిష్ఠా! నేనొక యాగము సేయఁదలఁచి దాని నొనర్చుచుండ మారీచ సుబాహులను రక్కసులు వచ్చి విఘ్నమొనర్చుచున్నారు. ఆకారణమున సవనరక్షణార్థమై శ్రీరామ లక్ష్మణుల దోడ్కొనిపోవవచ్చితిని. తొలుతమీదశరథుం డట్టి కార్యము నైన సేయుదునని పలికి రామునిఁ బంపుమని యడిగినంతనే సమ్మతించుటలేదు, ఇక్ష్వాకు కులప్రసూతుఁడగు నీదశరథుఁడే యసత్యమునకుఁ బాల్పడిన నే నేమందును.

వసి—(దశరథునిఁజూచి)

తే. గీ. కౌశికుండన్న సామాన్యుఁ డే గాఁదలంచి
నాపె! పార్వతీ భారతీ నాథులైన
భయమునందుదు రతనిః ప్రభావమునకు
శిష్టగుణసాంద్ర దశరథ క్షితితలేంద్ర.

ఈతనితో మహిమ నీవెఱుంగక యిట్లు బలికితివి.

దశ—మహాత్మా! ఈతపోనిధి మహిమం బెఱుంగక కాదు. శ్రీరాముని నెడబాసి యుండఁజాలని వాడనగుటం జేసి యట్లు వక్కాణించితిని. అదియుంగాక, నస్త్రవిద్యల నింతవఱకు నభ్యసించి యెఱుంగని యాకుమారులు దైత్యులదు్రంచి, సవనం బెట్లురక్షించ గలరాయని కూడ సందియము గలుగుచున్నది.

వసి—దశరథా! నీవు కుమారులవిషయమై సంశయింపవలదు. వారన్నివిధముల గాధేయునివలనఁ గృతార్థులగుదురు. సంశయింపక రామలక్ష్మణుల నీతని వెంటఁ బంపి ధన్యుఁడవగుము.

దశ—గురువరా! నీవట్లు బలుకుచుండ నేనేమనువాడ. (విశ్వామిత్రునిఁజూచి) కౌశికమునీంద్రా! పుత్రమోహమునఁ జేసి యట్లు వచించిన నన్ను మన్నించి శాంతివహింపుము. నీయభీష్టము నెఱవేరుగాక. (సేవకునిఁజూచి) సేవకా! నీవరిగి రామలక్ష్మణుల దోడ్కొని రమ్ము.

[సేవకుఁడు నిష్క్రమించి వెంటనే శ్రీరామలక్ష్మణులతో బ్రవేశము]

శ్రీరాముఁడు—
లక్ష్మణుఁడు— } (దశరథునకు నమస్కరింతురు.)

దశ—(రామలక్ష్మణులఁజూచి) పుత్రులారా! ఈవిశ్వామిత్రమహర్షికి నమస్కరింపుఁడు.

శ్రీరా—
లక్ష్మ— } (విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా—కల్యాణసిద్ధిరస్తు.

శ్రీరా—(దశరథునిఁజూచి) నాయనగారూ! మమ్ము రావించుటకుఁగారణం బెఱుంగవేఁడెదను.

దశ—కుమారా! మీయిరువురును, నీకౌశికుని వెంటనీతఁడొనర్చుచున్న యాగసంరక్షణార్థమై దనుజులం దుంచుటకుఁ బంపుచుంటిని. కావున నీవయ్యెడ సౌమిత్రితోఁ గూడ నతిజాగరూకతతో మెలంగుచు,

చ. అనఘుఁడు గాధిరాజసుతుఁ డాజ్ఞనొసంగిన యట్టులుండి, నీ
వనుపమశౌర్యమేర్పడఁగ నాజిముఖంబున గ్రూరదైత్యులన్
దునిమిమఖంబుగాచి; విబుధుల్ నుతియింపఁగఁ గీర్తిగొన్న; యా
మనుకులగౌరవంబు నసమానగతిన్ నిలబెట్టుమాత్మజా.

శ్రీరా—

మ. జనకా! నీవ్రువచించినట్లిపుడు విశ్వామిత్రునింగూడి నే
జని; దైత్యాధములన్ రణంబున వెసన్ జక్కాడి, నొక్కుమ్మడిన్
మునివర్యుండు ముదంబునందగ మఖంబున్ వేడ్క రక్షించి, నీ
కనుమోదంబు ఘటిల్ల జేయుదు నృపాలా సంశయం బేటికిన్.

విశ్వా—రాజా! చూచితివా! నీకుమారుని సాహసవిక్రమములు.

లక్ష్మ—(తండ్రింజూచి) తండ్రీ!

తే. గీ. అగ్రజుని వెంట నేగి యయ్యజనరక్ష
ణార్థమయి దైత్యులను దునుమాడుపట్ల
సాయమొనరించి నీకును సంతసంబు
నొదవజేతునటఁ బంపుమీ ముదముతోడ.

దశ—తండ్రీ! లక్ష్మణా! నీవన్ననను సరించి జాగ్రత్తతో నుండుము.

విశ్వా—రాజా! ఇక మేము పోయివచ్చెదము.

దశ—

తే. గీ. వంశపావనుఁడౌ రఘువర్యుఁ బాసి
మనఁగజాలను గావున మానివర్య

వీరినెళ్ళంగి నరసిద్ది చేసి మన్కోడ
భారమంతయు నీయది భవ్యచరిత.

విశ్వా—దశరథా! నీవు వీరింగూర్చి నాకింతగాఁ జెప్పవలయునా!

శ్రీరా—తండ్రిగారూ! మేమిప్పుడే మాప్రయాణమునుగూర్చి యమ్మలతోఁ జెప్పి, యాశీర్వచనములఁ బొంది వచ్చితిమి.

విశ్వా—కుమారులారా! మంచిది. రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





# అహల్యా శాపవిమోచనము.

## పంచమాంకము.

రంగము:—[వింధ్యారణ్యము:—ప్రవేశము:—విశ్వామిత్ర, శ్రీరామలక్ష్మణులు.]

విశ్వా—కుమారులారా! ఇదియంతయు వింధ్యారణ్యము. ఈప్రాంతమునందే నిశాచరులు సంచరించుచుందురు. మనమతిజాగ్రత్తగాఁబోవలయును.

శ్రీరా—మునీంద్రా! బాణపాణులమై మేముండగాఁ నిశాచరులవలన భయమేమియొదవును.

చ. అనిమిష దైత్యకింపురుషులాదిగ నెవ్వరువచ్చి నిల్చినన్
మనమున నించుకంతయును మానము బొందము; భీతిఁగొందకే
రణమున వారినోర్చెద విరాజిత విక్రమముల్లసిల్లఁ నీ
మనమునకున్ ముదంబిడెద మానసమందున శంకయేటికిన్.

[తెరలో]

ఆహా! ఎన్నిదినంబులకు మానవులు నాకంటఁబడినారు. నేఁడింతయు సుదినము వీరిని నాహారముగాఁ జేసికొందునుగాక!

శ్రీరా—(విశ్వామిత్రునిఁజూచి) మునీంద్రా!

మ. ధరణీమండలి బ్రద్దలై తనరఁ బాతాళంబు ఘూర్ణిల్ల; భా
స్వరచంద్రార్కులు భీతిచే గతుల దప్పన్ దారలున్ రాల, భీ
కరరూపంబుధరించి, యాగతిని గ్రేకల్ వెట్టుచున్ వచ్చు, నా
తరుణిన్ నాకెఱిగింపుమీయొవరో మోదంబయ్యె నాలింపఁగన్.

విశ్వా—రామా! అది వింధ్యారణ్య సంచారియగు నక్తంచరి. దీనినే తాటక యందురు. దీని సుతులే మారీచ సుబాహులు. వారే మదీయసవన విఘ్నకారకులు. (ఎదుటఁజూచి) అదిగో! అది మనమీదకే వచ్చుచున్నది. దీనినిప్పుడు వధించి మునీంద్రులకు మోదమొనరింపుము.

శ్రీరా—తాపసోత్తమా! స్త్రీక్షద్ధ! యెట్లు వధింతును? స్త్రీహత్య పరమపాతకమని యార్యులు వచింతురుగదా!

విశ్వా—రామా! నీవావిషయమున శంకింపవలదు. అది స్త్రీయైనను రాక్షసి. విశేషించి జగదపకారిణి. ఇట్టివారిని వధించినను శాపము సంభవింపదు. నీవు సేయఁబోవు కార్యము లోక సంరక్షణార్థము.

లక్ష్మ—

మ. జనకుండాజ్ఞనొసంగెఁగాదె మునియా జ్ఞం దీర్పుమీయంచు; నీ
వనుమానింపఁగనేల దీనికొఱకై యట్లుండఁగా నద్ది; యి
మ్మునిచంద్రుండు వచించుచుండె నఘం బున్నిన్నుం బొందదం
చును; నింకేటికి శంక, దైత్యవనితన్ శిక్షింపుమా రాఘవా.

[తాటకి—ప్రవేశించును]

తాట—(భీకరముగా) ఓహోహో! ఎన్నాళ్లకు మనుష్యమాంసము లభించినది. (విశ్వామిత్రునిఁజూచి) ఓహో! విశ్వామిత్రమునీంద్రులవారా! యాగము సేయుట విడిచిపెట్టి యెక్కడికో వెళ్లి వీరిని వెంటబెట్టుకొని వచ్చుచున్నారు. వీరిని నాకాహారముకొఱకే తోడితెచ్చుచున్నారు కాబోలు. ఆహా! నేఁడు నాకుఁ బండుగ. (శ్రీరామలక్ష్మణులఁజూచి) బాలకులారా! మిమ్ములను భుజించి నేటికి నాకడుపు సంపూర్ణమొందుచున్

లక్ష్మ—(రామునితో) అన్నయ్యా! మనము కాలహరణము సేయ కుండ, దీనిం దెగటార్పవలయును.

తాట—(కేకలు వేయుచు) రండు. రండు. మిమ్ములను చేతియొక దవ డను బెట్టుకొని చప్పరించెద.

(మీదకు వచ్చుచున్నది)

లక్ష్మ—ఓసీ! నీవు దుష్టనిశాటివని మేమెఱింగితిమి. నీకుఁ గాలము స మీపించుటచేతనే మాయెదుటఁ బడినావు.

తాట—ఓహో! కూతఘనముగానున్నదే నాయెదుట నిలిచి యింత భీకరముగా మాటలాడిన మానిసినిఁ జూడలేదే. మిమ్ము లముగ్వురను గూడ గుటుక్కున నొక్కసారి మ్రింగెదగాక. (విశ్వామిత్రునిమీదికి పోవుచున్నది.)

విశ్వా—రామా! రామా! ఇంక జాగుసేసిన మాటదక్కదు. దీనిం ద్వరగాఁ దెగటార్పుము.

తాట—ఓహో! వీరిని నన్నుజంపుటకుఁ బ్రోత్సాహము సేయుచుం టివా? ముందునీపని పట్టించెదఁ జూడుము.

శ్రీ—(విశ్వామిత్రునకడ్డముగానిలిచి)

తే. గీ. ఏలభయమింత పూనక ◊ పేరిలెదీవు
తాపసులకెల్ల మిగుల మో ◊ దంబుగలుగ
నిశితశరమునవధియించి ◊ యుపుడెనిన్ను
గాలుప్రీటికిబంపెద ◊ గాంచుమింక.

(శరప్రయోగము సేయును.)

తాట—(శరము దగులగా) హా మానిసీ! ఎంతసాహసము బూనితి విరా. (క్రింటుచు మీదకువచ్చుచుండును.)

శ్రీరా—ఈశరముతోఁ గూలుము. (వేఱొకశరము ప్రయోగించును).

తాట—హా! చచ్చితి. చచ్చితి. (నేలబడును)

విశ్వా—రాఘవా! నీశౌర్యంబునకు మెచ్చితిని. తాటకంగూల్చి మునులకు మోదము గూర్చితివి. (ఇంచుక యూరకుండి) కుమారులారా! త్వరగా నడువుడు. మన మా నదీ తీరంబున నొక్కింత కాలము విశ్రమింతము. అదియుంగాక, నానదియందు మీరు కృతస్నాతు లగుదురుగాక! మీకా కలిదప్పులు గల్గకుండ బలాతిబలలను విద్యలును, సమస్తాస్త్ర శస్త్రవిద్యలును నుపదేశించెదగాక.

శ్రీరా—దేవా! నీకటాక్షమున మేము కృతార్థుల మగుదుము.

(అంగలును విమ్క్రమింతురు.)

రంగము:—[విశ్వామిత్రాశ్రమము:- ద్వారముముందు, [శ్రీరామలక్ష్మణులు- ప్రవేశము]

శ్రీరా—లక్ష్మణా! విశ్వామిత్రుఁడు యజ్ఞదీక్షఁబూనియున్నాఁడు. నేఁడు సప్తమదినము. ఇంతవఱకును యాగము సలక్షణముగ జరిగినది. నేఁడు రాక్షసులు వత్తురేమో మనము జాగరూకులమై యుండవలయును.

లక్ష్మ—

శా. అన్నా రాఘవ! దైత్యులన్నవినుమీ యీ యావంతయున్ భీతితో
దన్నీచుల్ జనుదేరనిమ్ము సమర వ్యాపారమేపారగా
జెన్నారన్ వధియించి యాగమును ర క్షింతున్ నిమేషంబులో
నిన్నున్నన్నునుజూచికౌశికునిహృ న్నిర్రేజముప్పొంగఁగన్.

(తెరలో కలకలము)

శ్రీరా—ఏవియో భయంకరారార్భాటములు వినవచ్చుచున్నవి.

లక్ష్మ—(ఆలించి) అన్నయ్యా! దైత్యులేవచ్చుచున్నారు.

శ్రీరా—రానిమ్ము.

(మారీచసుబాహులు-ప్రవేశింతురు)

మారీ—సుబాహా! మనము యజ్ఞమునకు విఘ్నమొదవించుచుంటిమని విశ్వామిత్రుఁడెవ్వరో యిరువుర రాజకుమారులను దెచ్చినాఁడట; అమానవులు మనయమ్మను వధించుటచేఁగలిగిన చింతచే నీటివఱకును వీనియాశ్రమమువంకకే వచ్చుటవేదు. నేఁడా రాజకుమారుల వధించి మునియజ్ఞమును ధ్వంసము చేయుదముగాక! (ఆశ్రమములోనికిఁ బోవఁబూచుచున్నారు.)

శ్రీరా—ఓరీ! దైత్యులారా! శ్రీరాముఁడిచ్చట లక్ష్మణ సమేతుఁడై విశ్వామిత్రి సవన రక్షణము సేయుచున్నాఁడు. మీరొక యడుగైన నావలఁబెట్టవలదు. ప్రాణములపై నాసఁగలదేని యావలకుఁ బొండు.

మారీ—

శా. ఓరీగాధిసుతుండు మిమ్ముమఖమో ꠰ హాకావగా దెచ్చెనే
మారీచున్ననునెన్నఁడైనవినవో ꠰ మర్త్యుండవీ వెంతరా
రారండిప్పుడె మిమ్మునిద్దఱును ꠰ గ్రాసీవెసంజీల్చి యా
హారంబానటు జేసికొందు మునులా ꠰ హాకావముల్ సల్పఁగన్.

లక్ష్మ—ఓరీ! దానవాధమా! ఇంతకుమున్నే మీతల్లియగు తాటక మాచేఁగూలి యంతకు నియింటి కతిధియైనది. మిమ్ముఁగూడ నామెకడకుఁ జేర్చెదము.

సుబా—నీచమానవా! నీవలె ప్రగల్భములు బలికిన వారెందఱు మాచే నింతకుమున్ను గూలిరో!

ఉ. కంచెదఁబిండిపిండిగను ꠰ దథ్యముగాని దేమిమ్మునిర్వురన్
బంచెదఁగాలుపీటికిని ꠰ బాహుపరాక్రమవిక్రమంబు జూ
పించెద దేవతల్ కలఁగ ꠰ బృథ్వినినెల్ల నమానుషంబు గా
వించెద నిల్వుమీ యిచట ꠰ వీరుడవై ననుమానుషాధమా.

శ్రీరా—

ఉ. ఓరినిశాచరుండ ఏను । ముగ్రరణంబున నిల్చిపోరుచున్
బీరముజూప కిగలిని । బ్రేలెదవేటికి కారులర్ మహా
ధీరుఁడవేని వెన్నిడక । దివ్యశరంబులకోర్చుకొమ్ము నీ
సారముబీరముంగనెద । సంగరరంగమునన్ నిశాచరా.

సుబా—ఇదిగో! ఈశరమును గాచుకొనుము.

శ్రీరా—(శరమును ఖండించి వేరొకశరమును బూని) దైత్యాధమా ఈశరము తప్పక నీప్రాణముల దీయును. (ప్రయోగించును)

సుబా—హా. (నేలఁగూలును)

మారీ—(కోపముతో) ఓరా! మానవాధమా! మాతమ్ముని జంపితివిగా! ఇదిగో! నిన్ను దుదముట్టించెదఁ గాక. (మీదకువచ్చుచుండును.)

శ్రీరా—(మారీచునిపై శరప్రయోగము సేయగా నాతఁడు కనఁబడకుండఁ బోవును)

లక్ష్మ—అన్నయ్యా! నీశరసంధాన నైపుణ్య మత్యద్భుతమును గొలిపినదే. ఆమారీచుఁడెంతదూరమునఁ బడెనో తెలియుటలేదు.

(విశ్వామిత్రుఁడు-తొందరగాఁ బ్రవేశించును)

విశ్వా—(రాముని గౌగలించుకొని)

తే. గీ. జనకుఁడంపఁగఁ జనుదెంచి । సవనరక్ష
శార్థముయిసుతారులఁ జన్మి । యశమునంద
జాలితివినీవు రాఘవా । జలజమిత్ర
వంశపావనుండవనఁగ । వలయునిన్ను.

రామా! నీవలననాయాగముజరిగినది.

శ్రీరా—
లక్ష్మ— (నమస్కరింతురు)

శ్రీరా—గురువర్యా! ఇదియంతయు నీకరుణయే అనేకవత్సరములు శుశ్రూషగావించినను బడయఁజాలనియస్త్రవిద్యలు మాకుని ముషములో నుపదేశించి మమ్ము ధన్యులుగాఁ జేసితివి.

లక్ష్మ—(ఎదుటఁ జూచి) మునీంద్రా! పెండ్లికిఁదరలిపోయినట్లనేకులా మార్గమునఁ మహావైభవముతోఁ బోవుచున్నారు. వీరందఱు ను నెచ్చటకుఁ బోవుదురు?

విశ్వా—వత్సా! సౌమిత్రీ!

చ. జనకుని యింటనున్న శివ చాపము ద్రుంచిన యట్టివానికే
తనయను నిత్తునంచునను బందమునఁ జాటఁగఁబంచియుండె నా
జనపతి; దానికై యిటులు క్ష్మాపతులందఱు బోవుచుండిరా
జనకజ నెట్టులైన విల సన్మతిఁ బెండిలియాడు వాంఛతోన్.

నాకును నాజనకుఁడు తన్మహోత్సవము వీక్షించుట కాహ్వానముఁ జేసినాడు. రేపు, మిమ్ములను వెంటబెట్టుకొని మిథిలకరుగుదును. రామా! మిగుల నలసి యుంటివి. విశ్రమింతువుగాక రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)



రంగము:—[గౌతమాశ్రమప్రాంతము :—ప్రవేశము శ్రీరామలక్ష్మణ విశ్వామిత్రులు.]

శ్రీరా—మునీంద్రా! మనమిప్పుడు పోవుచున్నది మిథిలాపురమునకే కదా!

విశ్వా—అవును.

శ్రీరా—గురువర్యా! ఈప్రాంతమున మున్నెప్పుడో యొక్క మునీం
[illegible]

విశ్వా—రాఘవా! అది గౌతముని యాశ్రమము. (తనలో) అహల్యకు శాపవిమోచనము గలిగింపవలయును. అదిగో! పాషాణముననున్న యహల్య శ్రీరాముని పదంబులు సోకినేని యామె తనతొల్లిటి రూపమును బొందును. (ప్రకాశముగా) రామా! త్వరగా నడుగులు వేయుము.

శ్రీరా—(నడుచుచుండఁగాఁ బాషాణము రాముని పాదములకు దగిలి స్త్రీ యగును.)

శ్రీరా—(తనలో) అహో! ఏమి! ఈయద్భుతము.

అహ—(శ్రీరామునిఁజూచి, తనలో) ఈతఁడే. మనువంశతిలకుఁడగు శ్రీరామచంద్రుఁడు. ఈమహాత్ము కారణంబున నేను శాపము వాసితిని. (రామునిఁజూచి)

—♦ దండకము. ♦—

శ్రీరామరామా పరంధామ, కారుణ్యసీమా బుధక్షేమకామా నినుఁ వర్ణనఁ జేయ నేనెంతదానఁ రమా నాథ వైకుంఠనాథా; సదా భక్తసంత్రాణ శీలుండవై లోకముల్ గాచుచుఁ దేవదేవుండవై రాణఁదీపించుచున్నావు వేదంబులంగొంచు వారాశిలోఁ జొచ్చి నాసోమకుంద్రుంచి వేదంబులం దెచ్చి శ్రీభారతీనేతకర్పించవే, దేవతల్ రాక్షసుల్ బోరుచుండంగ కూర్మంబవై మంధరం బెత్తి బృందారకౌఘంబు రక్షింపవే, భూమినిం జాపగాఁజేసి చుట్టంగ నూహించు దైత్యుఁ హిరణ్యాక్షునిఁ సూకరాకారమున్ బూని డున్మాడవే, నిన్ను సాధింప లోకంబులఁ బాధలఁ ముంచుచుఁ గన్నపుత్రుఁ మహాకోపమున్ బూని హింసింపగా నెంచు నాదైత్యు భంజించి, తత్పుత్రుఁ బ్రహ్లాదు రక్షింపనే నారసింహుండవై; వామనాకారముఁ దాల్చి దైత్యేంద్రుడౌ యాబలిఁ జేరి, యాచింపవే, జామదగ్న్యుండవై దుష్టభూ

మీరాశులఁ ద్రుంచవే, తండ్రి; నారాయణా వేదపారాయణా నేఁడు భూభారమున్ వాప, బృందారకుల్ నిన్నుఁ బ్రార్థింపగా సూర్యవంశంబునందిట్లు ప్రాదుర్భవంబొంది రాజిల్లి నావా, మునీంద్రస్తుతా! రామ, నీమూర్తి నేఁగంటి నాశాపముల్ వాయగాఁగంటి శ్రీరామ శ్రీభాను వంశాబ్ధిసోమా నమస్తే నమస్తే నమః.

దినకరవంశదీపా! రామచంద్రా! నీవు సాక్షాత్ శ్రీమన్నారాయణుండవు భవదీయపదరజము సోకుటచే జేసి, నేను కృతార్థనైతిని. (విశ్వామిత్రునిఁజూచి) కౌశికమునీంద్రా! ఇదియంతయు నీకరుణ.

శ్రీరా—(విశ్వామిత్రునిఁజూచి) మునీంద్రా! ఈమె యెవరు. శాపమేమి?

విశ్వా—గౌతముని భార్య. శాపము సంగతి తరువాత చెప్పెదను. (అహల్యంజూచి) నారీమణీ! నీవు కృతార్థురాలనై పాపవిముక్తనందితివి. ఇంక నీవు నీపతిం జేరఁబొమ్ము. ఈశ్రీరాముని వెంటఁబెట్టుకొని నేను సీతా స్వయంవరార్థమై మిథిల కరిగెద.

అహ—(రామునిఁజూచి) తండ్రీ! రామభద్రా!

చ. దినకరవంశ దీపనము । దీర్ణచరిత్ర! మహానుభావ ను
మ్మునివరుఁడైన కౌశికుని । భూరికృపన్ జనులెల్ల మెచ్చఁగా
జనకజఁ బెండ్లియై ఘనయ । శంబును గాంతువుగాక ధారుణిన్
మనుకులకీర్తివల్లియ స । మానముగా దిశలందుఁ బ్రాకఁగన్.

విశ్వా—సాధ్వీమణీ! భవదమోఘాశీర్వచనము ఫలించుగాక! ఫలించుగాక!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

సంపూర్ణము.



## అనుబంధము:

(1) ఇందుప్రియ (1) కన్నడ - ఆది

ఎంతపని జేసె - భారతీకాంతుఁడు॥
కంతుని గేలినను - సుంతయైనజూడక యహల్యా
కాంతను, మునిపలిమని - గాంతునకొసగ ॥ఎం॥
ఎటుల సైతు నేమిసేతు - నేదిదారినాకు
కుటిలనేత్రిగూడక - పట్టుతరముగ నెటులనిలతు ॥ఎం॥

(2) అనుబంధము—(2) కమాచి - రూప - ఇందుప్రియ.

ఇంతి - కంతునిచేబాతి - ఎంతనిచింతింతును॥
వింతగ జగముల - మోహవారి ముంచు
కాంతప్రు నివటు - గౌతము గోనెదవని
స్వాంతమునందున భావింపగ నతి కా
సంతయు మోచింపగ - జాలవైతివో ॥ఇం॥

(3) మోహన - ఆది - ఇందుప్రియ.

ఎటులమఱచిపోగ సఖుడా॥
కుటిలాలక సౌందర్యంబును ॥ఎ॥
మూడుజగములనే - వాడనుజూచిన, యాపూ
బోడికేసియగు - పోలతులు లేరట ॥ఎ॥
ఏపనిసేయుచు నుండినా
కాపడతి స్వరూపము గనబడు
తాపమునేగతి బాయుదు సం
తాపము నెటుపేదుదు ॥ఎ॥

(4) ధీరశంకరాభరణము - ఆది - [illegible])

ఏమని తెలుపుదు కామినీ
నామదిచింత ॥ఏ॥
కామినీమణి యహల్యా - కౌనగౌరి
నామనోహరుఁడరిగెను - నాతిసజాడ
భామినిగానగ రాకుండెను॥ ఏ॥
నేటికి బహుదినములు చనె, యీ
రాటము మదికెసనెచ్చెనా
బోటిపెండిలి యేవిధమున జరిగెను॥ ఏ॥

అనుబంధము (5) సోటు - గౌత.

బహుగుంజడ దాటెసి - సనుగొని యీ
యిడుములు బహుమునుటివిగా - పహతి ॥బ॥
ధనముగలిన్నన్ - ధన్యుల నెరగిసనైనన్
గొసియుండిన యీగితిఁ కందప్పగా ॥బ॥

అను (6 [illegible] - [illegible] - అహల్య.

సతికెపుడును - బలిసేవనె సౌఖ్యప్రదము ॥స॥
పతి రోసముల బహుమంచినవి - సమకతి సౌఖ్యము [illegible]
క్షితిసజెలంగును - నతులితసుగుణా ॥స॥
స్వాంతమునందిది బహుల - చింతలబాపును
పంతమున శుభములు - సరగునగూర్చును॥ స॥

(7) ఆభి - రూ - అట - అహల్య.

ధన్యనైతివిను - తాపసనాథా నే॥
మాన్యదమించెను - మామకజన్మము

మాన్యగుణాకర - నీయుపదేశంబున ॥ధ॥
పతివ్రత లక్షణములు - బాగుగబోధించి
మతిరంజిల్లగ జేసితివి - మానిచంద్రాస్యసాంద్ర ॥ధ॥

8 నాటకురంజి - ఆది - ఇంద్రుడు.

ఎంతచూచినా - చింతపోదు - ఏమిసేతు॥
కాంతపైననా - స్వాంతముచిక్కె - నాసుదతి
రూపు వింతగగనులకు - గట్టినట్టులుండె॥ ఎం॥
సతినిగూడకనే - బతుకగలనె యీ
క్షితి - దీనికేమిసేతుప్ర - నా - మతిమోహింపగ॥ ఎం॥

అను (9) శంకరాభరణము - ఆది - మణికంధరుడు.

చాలు చాలు - చాలింపుమాసఖుడా ॥చా॥
బేలవై యీలీల - యీబాలకై
గోల చేసెదవు ॥చా॥
అమరవిభుడ నీవు - నొక్క - యతివకొరకు
తమిజెందిన విని - యమరులెల్ల నవ్వరే ॥చా॥
తగదు - తగదు నామాటవినుము
మగువకై యిట్లు చింతబడుట ॥చా॥

(10) అనుబంధము సారంగ్ - ఆ - మణికం

ఆగ్రహింపకయ్యా - నీశ్రీయమెకోరి - యిట్లుబల్కుచుంటి॥
నిగ్రహింపుమీ యాకోర్కె
అనుగ్రహింపుమీనను - గ్రహింపుమీనాపల్కు ॥ఆ॥

(11) సాకి - శచి.

నీమదిని నేను గనుగొంటినిపుడు।
భామ యహల్యకై సంతాప మందుచుంటివి।

ఆముని పత్నికోరకిట్లు చింతనంద
అమరపతివైననీకు నిది ధర్మముగునే.

మిత్రము—సరిసరి యీమాటలు నెవరైనను వినిన
పోరి బోరినను దూరకయుందురె ॥సి॥

(12) కమాచి - అట - శచి.

మనవి వినుమా - నాథా - నామాటను గనుమా ॥మ॥
అనుమానము విడుమిక - మానమందున నీగతి
ఘనముగ నెకనిని - గై కొనినవనిత కొఱకు
వనటగుందుటది తగునే ॥మ॥

(13) హిందోళ - అట - శచి.

పరవనితారతి - అతిపాపప్రదము
బహుళ దుఃఖాకరంబూ - దుర్యశఃప్రాప్తి కారణంబూ
గావునదీనిని బెద్దలు దీనిని
బోవిడుతురు నామాటలవిని
గౌతమసతికై యుత్సింపక యుండుము
భూతలమందున ఖ్యాతినిగనుమిక ॥ప॥

14, శ్రీరాగ - ఆది - ఇంద్రుడు.

ఆహా! ఏమి యీయ్యాందము - సుందరవదన చందము ॥ఆహా॥
వహ్వారే దీనిమోము - సోముని గేరు
దీనికనులు కంజాతముల - నేలు
తరముగాదు కం - ధరము నెన్న
ధరము మించియుండె ॥ఆహా॥

(15) ఆను - హింతోడి - విశారద.

వనితా - ఈవనసమును గనుగొనుమా॥
మనమున కెంతో - నుప్పొంత మోదముగూర్చె ॥వ॥
కనులలరగ యెల్లెడ - ఘనముగ బుష్పలతల్
జనములు ముదమందగ - ప్రకసించెను ॥వ॥

(16 [illegible]వి - ఆది - ఇందుస్రుడు.

పెరవాడనా - సతిపూజకేమినేను (నీకు)
నిజముబల్కెదను నిన్ను జూడగానె
గజిబిజగి జేసి - కాముడో
త్రిజగంబులందు నీకు నీడగు సుదతిలేదు
ఆయుసినా కిగ బల్కెదనన్ను జూడుము ॥పె॥

(17) హింతో - ఇందుస్రుడు.

సాకీ॥ ఓశరత్కాల సంపూర్ణచంద్రాననా
ఓత్రిజగన్మోహన విగ్రహసుందరాస్యా
ఇకనామది దాచగనేటికి - నిజమువచించెద వినుమానా
మానసమిప్పుడు నినుగలియగ గోరుచున్నది సుదతీ ॥ఓ॥

(18) మోహన - రూ - అహ

తగునా - నీకిది - నగరే - జనములు ॥త॥
అగణితగతి - త్రిజగంబుల కధిపతివై ముని
మగువను ననుచివిధమున గోరగ ॥త॥
పరవనితలగోరుట - పాపముగాదా - సం
తాపముగాదా - యిది ॥త॥

(19) అఠాణా - ఆది - శచి.

వలదు - వలదు - యిక నీపలుకులునూనుము ॥మనరేంద్రా॥
పలుకుటకీ వనర్మ్ముండవని - నాభావంబునను
దలచెద - వెడలుము॥ వ॥
మూడులోకముల నేలెడివాడవు మునిపూ
బోడిని ననుగోరుదువే - సాహసమునుబూంనుసువే॥ వ॥

(20) ఆనందభైరవి - రూ -

దాసుడనను దయిగనుమా - తరుణీ॥ దా॥
వాసిగాను నీయధర సుధారసమిడినన్
భాసిల జేయుము పుణ్యముగల్గు॥ దా॥
నీమీదనే నిరతము - నామది నిలచియున్నది
తామసమిక మానుము - ధన్యుని జేయుము॥ దా॥

(21) వసంత - శచి.

చాలు -పో-పో- ఈమాటలు విసినన్
నానాధుడు - సైరించునే॥ చా॥
జపమున - దపమున - వాసికి నెక్కిన
నాపతి - యీగతివినిన - నిన్నును - నీ
లోకంబున - నిమిషములో - భస్మముసేయడె ॥చా॥

(22) కమాచి - ఆది - ఇంటుగ్రదు.

మనమాయిపుడే - గనగలేదవా
వనితను - తొందరపడకో ॥మ॥
ఎట్టిమాయచేసైన - గుట్టుతెలియకుండ
నా యండజయానను - జేరెద ॥మ॥
కాంతనుగని నీవెంతయు - సంతోషింతువు
చింతదీరును నిదినిజముక ॥మ॥

23 భూల - ఆది - గౌళ

ఓరోరి దుష్టచరితా - క్రూరా ॥ఓ॥

మారునిసంగరమున దేలగనీకుచు

మానీంద్రులపత్నులె కావలసెనుగా ॥ఓ॥

అసురవిభుండవు నీవిటు - లాచరింతువని

నామది నెన్నడు - దలపగనైతిని ॥ఓ॥

24 జా - గౌళ.

పోపొమ్ము దుష్టచారిణీ - ఛీ - ఛీ - స్వైరవిహారిణీ॥ పో॥

బ్రహ్మమానసపుత్రికైన ఘటులు - మరులుగొని

నాకవిభునిగవసి నావుగా॥ పో॥

సతులకెల్ల నీవ్రుదల - కట్టువగుదువనుచు

మతినిదలచిన నాయాస - కృతినిగలిపితే॥ పో॥

25 జంఝూటి - రూప . విశ్వామిత్రుడు.

పంపింపుమా - జనవర - నావెంట॥

యింపుగాను - పెంపుగా - సొంపుగా - నీకొమరులను॥ పం॥

జనవర నారక్కసులం

దునుముచు నా సవనంబున

ఘనముగ బ్రోచును నీకొమరుడు

గుణశీలుడు రాముడు॥ పం॥

26. కాంభోజి - రూపక - దశరథుడు.

పంపజాల - మానివరా - నన్ను - మన్నింపుమా -

నింపుగా॥ పం॥

బాలుడు రాముడు - న[illegible] నాతడే॥

వానిబాసి నా - నాదేహము నిలువదు॥ పం॥



# గ్రామోఫోను హాస్యపుపాటలు.

వెల 0—6—0.

ఇది శ్రీ వల్లూరి జగన్నాధరావుగారిచే రచియింపబడినది. ఇందు కోడిపాట, పడవపాట, లంజపాట, గోంగూరపాట, పప్పుబ్రాహ్మణుని పాట్లు, హోలిపాట మొదలైనవి ముప్పదిరెండుపాటలు గలవు. వింతవింత పాటలు, నవ్వువచ్చే పాటలు గలవు. వెల స్వల్పము. అనేక చోట్ల యీపాటలు గ్రామోఫోనులో పాడబడుచున్నవి. ఇదివరకు నాలుగుకూర్పులు పుస్తకములు అయిపోయినవి. ఇది ఐదవకూర్పు. త్వరపడినగాని ప్రతులు దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు.

# సంగీత విష్ణులీల.

వెల 0—12—0.

ఇది శ్రీహరి అవతారములన్నియు నాటకముగా వ్రాయబడినది దీనియందు పార్శీకర్నాటక మెట్లుగూడా గలవు. యిట్లాగుగా యింతకుమున్ను యీనాటకము యెవ్వరిచేతను రచియింపబడియుండలేదు. యీబుక్కు అచ్చువేయుచుండగనే అనేక ఆర్డరులు వచ్చియున్నవి. యీనాటకము ప్రతివారి హస్తమందును వుండితీరవలెను. కొనితీరవలెను. చదివి ఆనందించి తీరవలెను. ప్రతిపుస్తకభాండాగారమును అలంకరించి తీరవలెను. ఆలస్యముచేసినచో ప్రతులుదొరకనేరవు.

# వేశ్యాహితబోధిని.

వెల 1—0—0

వేశ్యలయొక్క మాయోపాయములున్ను విటులయొక్క పాట్లున్ను వేశ్యలను మెప్పించి దివాలాతీయుటయు అనేకమైన చిత్రవిచిత్రమైన ఫార్సులతో నిండియుండును. చాలా అద్భుతముగా యుండును.

వలయువారు:—మునుకూరి సుబ్బారావు బుక్కుసెల్లర్,

ధీమునోలు, క్రిష్ణాజిల్లా.

# ఊర్వశీశాప విమోచనం.

---

వెల 0—12—0 మాత్రమే,

ఇది శ్రీ అయినాపురపు సుందరామయ్యగారిచే రచియింపబడినది. అన్ని రసములు యిందుగలవు. ఇంద్రుడు శచీరంభలతో సరససల్లాపము. దూర్వాసుడు ఊర్వశిని యిప్పించమని ఇంద్రుని కోరుట. ఊర్వశిని ఇంద్రుడు రప్పించుట. ఊర్వశి బెట్టుసరిజేయుట. ఆఖరకు వప్పుకొనుట. దూర్వాసుడు తనఉద్యానవనములోకి వెళ్ళి కామముతో తపించుట. ఊర్వశి వచ్చుట. దూర్వాసుడు పైబడబోవుట. ఊర్వశి బెట్టుసరిజేయుట. దూర్వాసుడు కోపగించి ఊర్వశికి శాపము యిచ్చుట. ఊర్వశి గుర్రముఅయి విక్రమసేనునకు దొరుకుట. శ్రీకృష్ణుని కుమారుండైన మన్మధుడుకూడా ఊర్వశీగుర్రంకోసం ప్రయత్నముజేయుట. మన్మధుడు యీగుర్రము దొరకేవరకు నిద్రాహారములు ముట్టను అని ప్రతిజ్ఞజేయుట. నారదుడు మన్మధుని విక్రమసేనుదగ్గరకు గుర్రము కావలయునని పెళ్ళుట. విక్రమసేనుడు గుర్రము యివ్వనని చెప్పుట. మన్మధుడు నీపని పట్టించెదనని ప్రతిజ్ఞచేయుట. విక్రమసేనుడు అభిమన్యుని శరణుకోరుట. మన్మధుడు అభిమన్యునివద్దకు అక్రూరునిరాయభారిగా బంపుట. అభిమన్యుడువిడువనని చెప్పుట. అభిమన్యుమన్మధుల యుద్ధము బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రత్యక్షమై యుద్ధము ఆపుజేయుట. ఊర్వశి శాపవిముక్తయై మనుష్యరూపము పొందుట చాలా అద్భుతముగా యుండును. ఇదివరకు అనేకవేలప్రతులు ఖర్చు అయినవి. కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు, త్వరపడుడు.

వలయువారు:——

కురుకూరి సుబ్బారావు బుక్కుసెల్లర్,

భీమడోలు, కృష్ణాజిల్లా.